29.9.1995 శుక్రవారం 12 పేజీలు సంపుటి:67 సంచిక:37 విడిప్రతి రూ. 2.00 లు Phone: 27354 Regd. No. HNL 18

# జమీన్ రైతు



స్థాపకుడు: నెల్లూరు వెంకట్రామానాయుడు జీవప్రదాత: నెల్లూరు శ్రీరామమూర్తి

### మంత్రివర్గ విస్తరణ వెనక్కు పోయే కొద్దీ....

# నవ్వుల పాలౌతున్న చంద్రబాబు

రాష్ట్ర మంత్రి వర్గ విస్తరణ వినాయకుడి పెండ్లి చందంగా వుంది. అసెంబ్లీ సమావేశాల ముందు... వెనుక... ఢిల్లీ పర్యటన నుంచి రాగానే... 16 తేది.... 18 తేది.... వంటి గడువులు, వూహాగానాలు చాలానే గడిచి పోయాయి. ఇప్పుడు తాజాగా విజయ దశమి అంటున్నారు. ఆ తర్వాత దీపావళి మంచి ముహూర్త మంటారేమో తెలియదు. మంత్రి వర్గం పేరు వింటేనే పగటి పూట పీడ కలలు వచ్చేస్తున్నాయి ముఖ్యమంత్రికి; అందులో వేలు పెడితే కందిరీగల తుట్టెను కదిలించి నట్లవుతుందని భయ పడుతున్నాడు; ఆ తుంటరి పురుగులు జమ్మని ముసురుకొని, వళ్లంతా కుట్టి పెడతాయని జంకు తున్నారు.

నిజమే కదా మరి? ఎమ్మెల్యేలు, కంది రీగల కంటే ప్రమాద కారులుగా కన్పిస్తున్నారు. ఆయన ప్రక్కన 180 మంది వుంటే అందులో వంద మందికి లైటుండే కారు కావాలి! ఇవ్వకుంటే రచ్చ చేస్తున్నారు. అలిగే చిట్టి తమ్ముళ్లను ప్రియమార చేరదీసి,




ప్రేమగా అసమ్మతి తాయిలం తిన్పించ డానికి ఎన్టీఆర్ తలుపులు తెరుచుకొని కూర్చొని వున్నారు. మామకు చెలగాటం, అల్లుడికి ప్రాణ సంకటంగా వుంది పరిస్థితి. మహా అయితే 30 మందికి మాత్రమే ఇవ్వగలడు, మామ మాయ మాటలకు భ్రమసి తతిమా 150 లో 40 మందో 50 మందో అటు జారుకుంటే తన పదవీ మాంగల్యపు తాడు పుటుక్కున తెగి, రాజకీయ వైధవ్యం సంప్రాప్తిస్తుంది. ఆ వూహ భరించ లేకున్నాడు చంద్రబాబు. అందువల్లే మంత్రి వర్గ విస్తరణను నిరవధికంగా వాయిదా వేసుకొంటూ పోతున్నారు.

అట్లని ఎంత కాలం రోజులు నెట్ట గలడు? ఎల్ల కాలం అబద్ధాలు చెప్పి, వాయిదాలు వేసి పరిపాలన సాగించడం కష్టం. కానున్నది కాక మానదన్న నిజం గ్రహించి, గుండె దిటవు చేసుకొని ఏదో ఒక రోజు అందరిలో కొందరికైనా మంత్రి పదవు లనబడే తీపి ఖాజాలు తిన్పించి తీరాలి. అందులోనూ తోడల్లుడు డాక్టర్ వెంకటేశ్వర రావు - కుందేటి పీక నొట కరవ డానికి పొదచాటున మాటు వేసిన తోడేలు వలె కాచుకొని కూర్చుని వున్నాడు. వైస్రాయ్ హోటల్ విడిది సమయంలో ఏదో అవసరం కొద్దీ చంద్రబాబు ఆయనకు ఉప ముఖ్య మంత్రిత్వం ఆశ పెట్టాడు. ఇచ్చిన మాట నిలబెట్టుకొనే సత్య హరిశ్చంద్రుల నాటి సత్తె కాలమా ఇది? అది తప్పటమే ఈనాటి లోక ధర్మం. అప్పుడేదో చెప్పాడని, ఇప్పుడు ఉప

కొరవ 11 పేజీలో

# రూపాయి విలువ తగ్గినా భయపడాల్సిన పనిలేదు

డాక్టర్ ఎ.దుర్గాప్రసాద్

రూపాయి విలువ హఠాత్తుగా తగ్గి పోవటం వ్యాపార వర్గాలను ఆశ్చర్య పరుస్తోంది. రెండేళ్లకు పై నుంచి డాలర్‌తో రూపాయి మారక విలువలో ఎటు వంటి మార్పు రాలేదు. రూ. 31.50ల వద్ద స్థిరంగా నిల్చింది. కొన్ని కొన్ని సందర్భాలలో రూపాయి విలువ పెరిగింది తప్ప తగ్గలేదు. అటువంటిది, వున్నట్లుండి రూపాయి విలువ క్షీణించి, డాలర్ ఖరీదు 35 రూపాయలకు పెరిగి పోవడంతో ఆ మార్పును జీర్ణించు కోవడానికి వ్యాపార వర్గాలకు కొంత సమయం పట్టేట్టున్నది.

గత రెండు సంవత్సరాలుగా దేశంలో విదేశీ మారక ద్రవ్య నిల్వలు పెరిగి పోతున్నాయి; ఒక దశలో 21 బిలియన్ డాలర్లు, అంటే అప్పటి విలువలో 73 వేల కోట్ల రూపాయలకు చేరుకున్నాయి. దీనివల్ల పెట్టుబడులు పెరిగాయి. అయితే ఈ పరిస్థితికి మొన్న జనవరిలో బ్రేక్ పడింది. దేశం నుంచి ఎగుమతులు తగ్గి, దిగుమతులు అధికం కావటంతో విదేశీ మారక ద్రవ్యం నిల్వల్లో రెండు బిలియన్ డాలర్లు (7వేల కోట్ల రూపాయలు) హరించుక పోయాయి. పరిశ్రమల పై పెట్టుబడులు తగ్గినాయి. ఈ మార్పుల ప్రభావం రూపాయి విలువ పై పడింది.

35 రూపాయల దగ్గర స్థిరపడితే రూపాయి విలువ క్షీణత గురించి పెద్దగా భయపడ వలసిన పనిలేదు. ఇప్పటికి తగ్గిన విలువ కేవలం 10 శాతం మాత్రమే. చాలా సంవత్సరాలుగా దేశంలో ద్రవ్యోల్బణం 8 నుంచి 10 శాతం మధ్య వుంది. 10 శాతం ద్రవ్యోల్బణం అంటే వస్తువుల ధరలు 9 ఏళ్ల కొకసారి రెట్టింపుగా పెరుగు తాయని అర్థం. శాస్త్రం ప్రకారం ఇది నిజమే కాని, ప్రభుత్వం చెప్పే ద్రవ్యోల్బణం లెక్కలకు, వాస్తవంలో మనం ఎదుర్కొంటున్న ధరల పెరుగుదల సమస్యకు పొంతన లేదు. అమెరికాలో ద్రవ్యోల్బణం శాతం కేవలం నాలుగు. 1950 నుంచి 95 మధ్య కాలంలో, అంటే 45 సంవత్సరాల సుదీర్ఘ కాలంలో అక్కడి వస్తువుల ధరలు కేవలం 5 రెట్లు పెరిగాయి. దాని అర్థం వారి డాలరు కొనుగోలు శక్తి చాలా కొద్ది పరిమాణాలలో మాత్రమే క్షీణిస్తుందన్న మాట. అదే కాలంలో మన రూపాయి విలువ 33 రెట్లు పడి పోయింది. రూపాయికి కొనుగోలు శక్తి లేక పోవటంతో 1965 నుంచి ఎగుమతులు క్షీణించి, దిగుమతులు పెరిగి, రిజర్వు బ్యాంకు వద్ద అమెరికన్ డాలర్ల నిల్వలు లేకుండా పోయాయి. ఈ పరిస్థితిలో పూసుదాడక, 1966 లో రూపాయి విలువను మూడింట రెండు వంతులు (66 శాతం) తగ్గించింది ప్రభుత్వం. మన్ మోహన్ సింగ్ ఆర్థిక సంస్కరణల్లో భాగంగా 1992 లో రూపాయి విలువను రెండు సార్లు గణనీయంగా తగ్గించారు. ఇప్పుడు రిజర్వు బ్యాంకులో వున్న డాలర్ల నిల్వలు ద్రవ్యోల్బణాన్ని అదుపు చేయడానికి, ద్రవ్య సరఫరాను తగ్గించ డానికి సరిపోతాయి. అందువల్ల ఆందోళన చెందన వసరం లేదు.

ఇప్పటి రూపాయి విలువ క్షీణత ప్రభావంతో ఎగుమతులు చేసే కంపెనీలు పుష్కలంగా లాభాలార్జించ గల్గుతాయి; దిగుమతుల పై ఆధార పడిన పరిశ్రమలు అదనపు ఆర్థిక భారాన్ని భరించ వలసి వస్తుంది. 1996 మార్చి ఆఖరు ఫలితాలలో ఈ ప్రభావాలు వ్యక్త మౌతాయి.

షేర్ మార్కెట్‌లో షేర్లు కొనే వారు ఎగుమతులు చేసే కంపెనీలను ఎంపిక చేయడం మంచిది. దిగుమతులు ఎక్కువగా వున్న కంపెనీల పట్ల అప్రమత్తంగా వ్యవహరించాలి. అమెరికా అధ్యక్ష ఎన్నికలు పూర్తయ్యే వరకు అమెరికన్ డాలరు బలంగానే వుంటుంది. రూపాయి విలువ తిరిగి పెరిగే అవకాశం లేదు.

# ముఖ్యమంత్రి తాపత్రయం

అదుపు తప్పి, కదను తొక్కుతున్న రాష్ట్ర ప్రభుత్వ పరిపాలనా పగ్గాలు చేతిలో పట్టుకోవడానికి నూతన ముఖ్యమంత్రి శ్రీ చంద్రబాబు నాయుడు చేస్తున్న ప్రయత్నం బహుధా అభినందనీయం; చంద్రబాబు యువకుడు, ఉత్సాహం తొణికిసలాడే తత్వం కల్గిన వాడు. వ్యాపారాను భవం వల్ల, ప్రపంచ పర్యటన చేసిన వాడు కావడం వల్ల పరిపాలనలోని ఆధునిక పోకడలు, శాస్త్రీయ దృక్పథం అలవడినాయి. వీటన్నింటికీ మించి రాత్రీ, పగలు తేడా తెలియ కుండా కష్టించి పని చేయగల్గిన ఓర్పు వుంది. ఆ ఓర్పు, నేర్పులతో పరిపాలనా వ్యవస్థను సంస్క రించాలన్నది చంద్రబాబు తాపత్రయం.

రాజకీయంగా కూడా అది ఆయన కెంతో అవసరం. మహోధృతమైన, మహా ప్రచండమైన ఎన్టీఆర్ ప్రజాకర్షణా పెను గాలికి కొట్టుక పచ్చి, కుర్చీలో కూర్చున్న రాజకీయఅర్భకులు తెలుగు దేశం ఎమ్మెల్యేలు; చంద్రబాబు పరిస్థితీ అదే! రామారావును కాదని బయటకు వచ్చిన వారు అధికారమైతే చేపట్టారు కాని, ప్రజాదరణను పొంద లేక పోతున్నారు. వ్యక్తిగత గ్లామర్, జనం పై విసర డానికి సమ్మోహనాస్త్రాలు వారి వద్ద లేవు. ప్రజల మద్దతు లేకుండా సంఖ్యా పరంగా ఎంతటి బలోపేతమైన ప్రభుత్వమూ ఎక్కువ కాలం గద్దె మీద నిలువ లేదు. కాంగ్రెస్ పార్టీ వలె సంస్థాగత, వ్యవస్థీకృత, రాజకీయ యంత్రాంగమూ వారికి లేదు. పునాది అన్నదే లేని భవంతి వంటి ప్రభుత్వాన్ని తన భుజ స్కంధాల మీద మోస్తున్న చంద్రబాబుకు తన బలహీనతలు స్పష్టంగా తెలుసు. పదవి నిల్పుకోవడానికి, ప్రభుత్వాన్ని సుస్థిర పరచడానికి ఆయన రాత్రికి రాత్రి ఏ మాయలూ చేయలేదు; భూ మంత్ర కాళి అని అద్భుతాలు సృష్టించ లేదు. ఇంద్రజాల విద్యలతో ప్రజలను వశ పర్చుకోలేదు. నీతి నిజాయితీలతో కూడిన పరిపాలన, చిత్తశుద్ధితో ప్రజా సంక్షేమ కార్యక్రమాల అమలు వంటి చర్యల ద్వారా సమర్థుడు, సత్శీలుడు అని ప్రజలు మెచ్చుకునేలా వ్యవహ రించడమే చంద్ర బాబుకు తరుణో పాయం. పార్లమెంట్ ఎన్నికలు ఆయనకు పెద్ద అగ్నిపరీక్ష. ఆలోగా తన చాతుర్యంతో, సమర్థతతో ప్రజల మెప్పు పొంద గల్గితేనే వారి ప్రభుత్వం మన గల్గుతుంది; లేకుంటే మట్టి గలిసి పోతుంది.

ఈ నిజాన్ని బాగా అవగతం చేసుకున్న వాడు కావడం వల్లనే చంద్రబాబు పరిపాలనా వ్యవస్థ పెను నిద్దర వదిలించ డానికి అంత ఆతృత పడుతున్నాడు; అంత తొందర పాటు ప్రదర్శిస్తున్నాడు.

అయితే కేవలం సమీక్షా సమావేశాలు, చర్చా గోష్టులు జరిపినంత మాత్రాన పరిపాలన చక్క బడుతుందా అన్నది ప్రశ్న. అందులోనూ ఖజానాలో డబ్బు లేదు. ఎన్టీ రామారావు ప్రకటించిన సంక్షేమ కార్యక్రమాలు అమలు చేయడానికి ప్రభుత్వానికి శక్తి చాలడం లేదు. కొత్త పథకాలు ప్రకటించి ప్రజలను ప్రత్యక్షంగా ప్రభావితం చేసేందుకు వీలు కాదు. ఒక రకంగా ఇది కత్తి మీద సామే!

ప్రభుత్వ పథకాల అమలులో అవినీతిని, అనవసర జాప్యాన్ని అరికట్టడం ద్వారా మాత్రమే వాటి ఫలితాలను సత్వరం ప్రజలకు అందించడానికి వీలౌతుంది. హరిజన, గిరిజన సంక్షేమ కార్పొరేషన్లు, డిఆర్‌డిఎ వంటి సంస్థల వద్ద పుష్కలంగా నిధులున్నాయి. కేంద్ర ప్రభుత్వం నిర్వహించే జవహర్ రోజ్‌గార్ యోజన వంటి పథకాలకు నిధుల కొరత లేదు. అయితే ఈ సంస్థలు చేపట్టే కార్యక్రమాల అశాస్త్రీయ రూప కల్పన, ఆ సంస్థల్లోని అవినీతుల మూలంగా వాటి ఫలితాలు ప్రజలకు చేరువ కావడం లేదు. ఆశించిన రీతిలో అవి విజయ వంతం కావడం లేదు. ప్రపంచ బ్యాంకు సహాయంతో చేపడుతున్న కార్యక్రమాల పరిస్థితీ అంతే! ఈ నిధులను సద్వినియోగం చేసి, ఆచరణా త్మకమైన కార్యక్రమాలు రూపొందించ గల్గితే ప్రజలకు ప్రత్యక్షంగా సహాయ పడవచ్చు. సత్వర పారిశ్రామికీ కరణ ద్వారా నిరుద్యోగులకు ఉపాధి కల్పించి, యువకుల అభిమానం చూరగొన వచ్చు.

జమీన్‌రైతు

ఏది ఏమైనా రాష్ట్రాన్ని సరైన దిశలో నడిపించ డానికి ముఖ్యమంత్రి చేస్తున్న కృషి అభినంద నీయమైనది. ఆయనకు అన్ని వర్గాల ప్రజలూ, రాజకీయా తీతంగా తమ తోడ్పాటును అందించడం అవసరం.

## 50 ఏళ్ళ క్రితం ఈ వారం

జమీన్‌రైతు

27.9.1945

వెల: 0-1-6 పేజీలు:8

### జస్టిసు పార్టీ మళ్లీ మోటుకుంటుందా?

#### పార్టీ వచ్చింది

జస్టిసు పార్టీ గత ఎలెక్షన్‌తో తోక ముడుచు కుంది. తోక ముడుచుకోవడమే గాదు, దివంగతమై కర్మ క్రతువులు గూడా జరిగి పోయినాయి 1937లోనే.

#### జమీందార్లు వదలుకొన్నారు

ఆనాడు ఎలెక్షన్‌లో ధన మాన ప్రాణాలొడ్డి ధణు తెగిరించిన జమీందారు లంతా పాడి మీదున్న జస్టిసు పార్టీ నుండి తిరోధాన మైనారు. తిరోధానం కావడమే కాదు, ఏ ఎలెక్షన్‌లో గూడా నిలబడ గూడదని తీర్మానించు కున్నారు. మీదు మిక్కిలి కాంగ్రెసుతో మాత్రం సుతారం పోటీ నిలవనే గూడదనీ గూడ అనుకున్నారు. ఇంకా వీలుంటే కాంగ్రెసు వ్యక్తుల ప్రాపకం కూడా సంపాయించా లనుకున్నారు.

ఈ కారణంతోనే కస్తూరిబా నిధికి వేలకొద్దీ విరాళాలు గూడా యిచ్చారు. ఇంతా జస్టిసు పార్టీకి జమీందార్ల ప్రాపకం వుండబోదు అనే దానికి చెప్పవలసి వచ్చింది.

#### పెరియార్ గూడా విడిపొయ్యాడు

ఒకపోతే దక్షిణాది యువ నాయకుడున్నూ, ద్రవిడ స్తాన్ వాది అయిన రామస్వామి నాయకర్ యీ పార్టీతో విరాకులు పొంది ఎప్పుడో తొలగి పొయ్యాడు. ఒక షణ్ముగం చెట్టియార్ వంటి వారిలోక రిద్దరున్నా వారిని పట్టుకొచ్చి కూర్చున బెట్టవలసిన వారుగా వున్నారే గాని పెత్తనం నెత్తినేసు కొనే రకంగా కనిపించడం లేదు.

### నెల్లూరుముచ్చట్లు

#### 7 యేండ్ల శిక్ష

ఉదయగిరి తా. చిన్ననాగంపల్లిలలో 15.5.45 తేది నాడు మూరా చెన్నుగాడు అనే వ్యక్తి తన మారు తల్లితో తగువాడుతూ ఆమెను రాతితో కొట్టాడనీ, ఆ దెబ్బ కడుపు మీద తగిలి ప్లీహవృద్ధితో వున్న కడుపు పగిలి ఆమె చని పోయిందనీ ప్రాసిక్యూషన్ వాదము. నెల్లూరు సెషన్సు జడ్జి గారు విచారించి మొన్న 24 తేది తీర్పు జెప్పుచూ బలమైన ఘాత నేరం చేశాడనీ ముద్దయికి 7 సం. కఠిన శిక్ష విధించిరి.

#### ఔరా - ఇవి

నెల్లూరు గ్రామ మునసబ్‌ల ట్రైనింగు క్యాంపులో ఒక విలేజి మేజిస్ట్రేటు తాలూకా ట్రంకు పూడ దీసి 4 పంచలు, 4 చొక్కాలు అపహరించారట. సన్యాసుల ముందర కల్లుకుండ మాయమైనట్లు యిందరు విలేజి మేజిస్ట్రేటుల ముందర యీ చోరీ ఎట్లా జరిగిందండి?

'దొంగా ఒక మనిషే' అన్నట్లు దొంగా ఒక విలేజి మేజిస్ట్రేటే అనవలసి వుంటుంది. గుడ్డల కఱవు కాలంలో టెక్స్‌టైల్ ఆఫీసర్ చుట్టూ తిరిగి ప్రాధేయ పడి డబ్బు బెట్టి కొనేదానీ కంటె ఇది ఖాయైన వుపాయం.

* * *

కొరవ10వ పేజీలో

# కాలేజిలపై కలెక్టర్‌కు అధికారం ఎందుకుండదు?

కాలేజి లెక్చరర్లు ట్యూషన్లు చెప్ప కూడదనే గొడవలో లెక్చరర్లను సిలబస్ అడిగే అధికారం కలెక్టర్‌కు వుందా అని కొందరు వి.ఆర్. కాలేజి లెక్చరర్లు తలపోయడం అసందర్భం; ఈ ప్రశ్న వింటుంటే లెక్చరర్ల తెలివి తెల్లారి నట్లుంది. జిల్లా కలెక్టర్ జిల్లాలో సర్వాధికారి. జ్యుడిషియల్ విషయంలో తప్ప జిల్లాలోని అన్ని శాఖల విషయాల్లో కలెక్టర్ జోక్యం చేసుకోవచ్చు. ప్రతి శాఖ పైనా ప్రభుత్వానికి రిపోర్ట్ పంపే అధికారం కలెక్టర్‌కు వుంది. ఎయిడెడ్ కాలేజీల్లో పనిచేసే లెక్చరర్లు వేలకు వేలు జీతాలు పుచ్చు కొంటూ ట్యూషన్ల పేర లక్షలాది రూపాయలు సైడ్ బిజినెస్‌గా సంపాదించడం మొదలెట్టారు. మధ్య తరగతీయులు అవస్థలు గమనించి ట్యూషన్ల పై కలెక్టర్ తగిన నిర్ణయం తీసుకొన్నారు. పూర్వం గూడూరులో ఓవరు బ్రిడ్జి పూర్తయ్యే వరకు రైళ్లు తిరగడానికి వీలు లేదని హుకుం జారీ చేసిన ఘనత రామచంద్ర రావు కలెక్టర్‌కు వుంది. కలెక్టర్‌గా శంకరన్ తీసుకున్న నిర్ణయాల వల్ల ప్రజల్లో ఎంతో పేరు గడించారు. అందువల్ల కలెక్టర్ల అధికారాల గూర్చి చర్చించడం అనవసరం.

నెల్లూరు -టి.వి.నారాయణ

## సాహిత్యపరామర్శ బాగుంది

సెప్టెంబర్ 15 తేది జమీన్‌రైతు సంచికలో తెనుగు కవుల కోడి కూతను గుర్తు పోసాల వెంకట కృష్ణయ్య గారు చేసిన సాహిత్య పరామర్శ చాలా బాగుంది. విషయ విశ్లేషణ అద్భుతం. సాహిత్యంలో లోతులరసిన ప్రాజ్ఞుడు, రసజ్ఞుడు వ్యాఖ్యాత ఆ రీతంగా రాయగలడు. వర్ణనలో పెన్నానది, చిత్రణలో సకాలంలో ఎదుర్కొంటారు గనుక వర్ణన నంద్రే జీతగా గొప్పదన్న వ్యాసకర

## జనవాణి

వాదనతో పండితులు ఏకీభవిస్తారు. పత్రికల్లో సాహిత్య పరామర్శలే కరువైన తరుణంలో ఇటువంటి వాటిని ఇంకా ప్రోత్సహిస్తున్న జమీన్‌రైతుకు ధన్యవాదాలు.

-బ్రహ్మశ్రీ చక్రవర్తి కొండమాచార్యులు

తిరుపతి

### ఖమ్మంలోగ విచారణకు సిపిఎం సిద్ధం

సెప్టెంబర్ 15 తేది జమీన్‌రైతు, జనవాణి శీర్షికలో మన్సూర్ నగర్ ఆవాస్ పేరున సిపిఎం తన ధోరణి మార్చుకోవాలనే లేఖ ప్రచురితమైంది. కాని అక్కడ జరిగిన విషయం కుటుంబ వ్యవహారం. ఆ సంఘటనకు సిపిఎం పార్టీ వారికి ఎటువంటి సంబంధం లేదు. అక్కడ ప్రజా కోర్టు పెట్టి ఎవరినీ శిక్షించలేదు. ఆ ఆకాశ రామన్న ఉత్తరంలో పార్టీ జిల్లా కార్యదర్శి ఈ

కొరవ 10 పేజీలో

కొత్త ఉద్యమానికి నాంది పల్కుతున్న డిఐజి

# మహిళల కేసుల పై మహిళా సంఘాలకే అధికారం

కొత్త కొత్త ప్రయోగాలు చేసేందుకు నెల్లూరు జిల్లాను ప్రభుత్వ అధికారులు ఒక మోడల్‌గా ఎంచుకొంటున్నారు. గుంటూరు రేంజి డిఐజి ఎకె. ఖాన్ కూడా నెల్లూరు మహిళల కోసం ఒక కొత్త పథకాన్ని సిద్ధం చేశారు. ఖాన్ గారు కాకినాడ ఎస్పీగా పని చేసినప్పుడు ప్రవేశ పెట్టిన ఈ మహిళా సంక్షేమ పథకానికి మంచి రెస్పాన్స్ వచ్చిందట. పలు ఉద్యమాలకు పుట్టినిల్లైన నెల్లూరు జిల్లాలో ఈ ఉద్యమం విజయ వంతం అవుతుందన్న ఆశాభావాన్ని డిఐజి 27 తేది పత్రికల వారి ముందు వెలిబుచ్చారు. ఇక నుండి మహిళలకు సంబంధించిన కేసులన్నీ మహిళా సంఘాలు ముందల్లు విచారించి, గ్రామాల్లో తగిన నిర్ణయం తీసుకొంటాయి వారికా అధికారం పోలీసులే ఇస్తారట. మహిళలకు సంబం ధించిన కేసులు ఇటీవల కాలంలో పెరిగి పోవడం, పోలీస్ స్టేషన్లలో ఈ కేసులే అధికం కావడం వల్ల మహిళా సంఘాలకు ఈ అధికారమిచ్చి వారికి పూర్తి స్వేచ్ఛ, రక్షణ కల్పిస్తే మంచి ఫలితాలు వస్తాయంటున్నారు డిఐజి. దీని కోసం అక్టోబర్ మూడవ వారంలో మహిళా సంఘాలతో నెల్లూరులో ఒక ప్రత్యేక సమావేశాన్ని ఏర్పాటు చేయనున్నట్లు చెప్పారాయన. వర్గ రాజకీయాలతో కొట్టుక చచ్చే గ్రామాలలో డిఐజి గారి కొత్త ఆలోచన ఏ మాత్రం సఫలీకృతమవుతుందో వేచి చూడాలి. ఫిర్యాదు కాగితం వస్తే లాటరీ తగిలినంత సంబర పడి ఇరు వర్గాల వారి నుండి డబ్బులు గుంజే పోలీసులు ఈ సంఘాలతో సహకరిస్తారా? జిల్లాలోని ఉదయగిరి, కావలి ప్రాంతాల్లో నక్సలైట్ల దళాల సంచారం ఎక్కువైనట్లు డిఐజి చెప్పారు. ఇపుడు ప్రజల్లో సంచరిస్తున్న నక్సలైట్లు నిషేధం అమలులో వున్నప్పుడు ఎన్నో హతుకాల ఒడి కట్టారు. వారి పై ఎన్నో కేసులున్నాయి; ఇపుడు స్వేచ్ఛ అంటూ పబ్లిక్ మీటింగులతో జనాన్ని రెచ్చగొడితే ఎలా? అన్నారాయన. ప్రజాస్వామ్యంలో స్వేచ్ఛను బాగా వుపయోగించుకొని ఆ వ్యవస్థను రామేజీ చేయడం నక్సలైట్లకు తగదన్నా రాయన. నక్సలైట్లు తన రేంజిలో శాంతి భద్రతలకు భంగం కలిగిస్తే అణచి వేసేందుకు ప్రత్యేక కమెండో దళాలు ఏర్పాటు చేయడానికి వెను తీయనని

## నెల్లూరు సంగతులు

కుంత బ్రద్దలు కొట్టినట్లు చెప్పారు. సారా నిషేధాన్ని సమర్థ వంతంగా అమలు చేసేందుకు వారానికి రెండు రోజులు 8 ప్రత్యేక పోలీసు పార్టీలు మద్రాసు నుండి బయలు దేరే రైళ్లను చెకింగ్ చేస్తాయన్నారు. రైల్వే గార్డు, డ్రైవర్ క్యాబిన్లలో సైతం తనిఖీ చేసే అధికారం కోసం ముఖ్యమంత్రి ద్వారా దక్షిణ మధ్య రైల్వే జనరల్ మేనేజర్‌కు లేఖ వ్రాయించినట్లు చెప్పారు. జిల్లాలో జనవరి నెల నుండి పోలీసులు 272 కేసులు నమోదు చేసి 8 లక్షల విలువైన మద్యం పట్టుకొన్నట్లు వివరించారు. పోలీసులు పట్టుకొన్న మద్యంతో లాకప్ రూములు కిట కిట లాడుతున్నాయని, తడ స్టేషన్‌లో ఈ విషయం తాను కళ్లారా చూశానని, ఈ బాటిళ్లను ధ్వంసం చేసే అధికారం ఇవ్వమని ప్రభుత్వాన్ని అభ్యర్థిస్తున్నట్లు తెలిపారు. జిల్లా కేంద్రాల్లో మహిళా పోలీసు స్టేషన్లు విఫల మయ్యాయని డిఐజి అంగీకరించారు. దసరా చందాలు వసూలు చేసే పోలీసుల వుద్యోగాలు వూడతాయని; ఏ శాఖ వాళ్ళు మామూళ్లు అడిగినా పోలీసులకు ఫిర్యాదు చేయ... వివరించా రాయన ... ఇకంలో ఎసి

కొరవ 8 పేజీలో

# సణుగుడు

## * కలెక్టర్ కుర్చీలో ఏదో మహాత్మ్యమున్నట్లుంది!

నెల్లూరు కలెక్టర్ కుర్చీ ఏదో విక్రమార్కుడి సింహాసనం వలె వున్నట్లుంది. అందులో ఎవరు కూర్చున్నా వారిలో ఏదో ఒక ఉద్యమావేశం తన్నుక వస్తున్నది. శంకరన్, పార్థసారథి, అర్జున రావు, సుజాతా రావు, జన్నత్ హుస్సేన్, డాక్టర్ ప్రశాంత మహాపాత్ర, కె. రాజా, సాంబశివ రావు, ఇప్పటి గిరిధర్ వగైరాలంతా స్వయం ప్రేరిత ఉద్యమ ప్రభావితులే. ఒక్కొక్కరికి ఒక్కొక్క కార్యక్రమం పై ప్రీతి; ఆ కార్యక్రమం అమలు కోసం అహోరాత్రులు శ్రమించి, అందర్నీ అందులో నిమగ్నులను చేసి, వాటికొక ఉద్యమ రూపం సంతరింప జేసి తృప్తి పడడం ఆనవాయితీ అయి పోయింది. పరిపాలన నిర్వహించే అధికారులుగా కాక నెల్లూరుకు వచ్చే కలెక్టర్లు సంఘ సంస్కర్తలుగా, సామాజిక బాధ్యత నెరవేర్చే సంఘ సేవకులుగా వ్యవహరిస్తున్నారు. ఆ పదవికి, ఆ కుర్చీకి ఒక హుందా తనం సంతరించి పెడుతున్నారు. మారుమూల గ్రామాలలో సైతం, వేలాది మంది నిరుపేద హరిజనులు తమ ఇళ్ల స్థలాల పై యాజమాన్యం పొంది, ఆత్మ గౌరవంతో బ్రతక డానికి దారి చూపించిన వారు శ్రీ శంకరన్. ఆయన బదలీ అయ్యి ముప్పయేళ్లు గడచి పోయిన తర్వాత కూడా ఇప్పటికీ కొందరు హరిజనుల గుడిసెల్లో శంకరన్ ఫోటో వ్రేలాడుతూ వుందంటే వారి మనస్సులో ఆయనెంతటి పదిలమైన స్థానం పొందిందీ అర్థం చేసుకోవచ్చు.

సామాజిక వ్యవసాయ క్షేత్రాల రూపకల్పన ద్వారా అర్జున రావు కొన్ని వేల కుటుంబాలకు ఆర్థిక స్వయం

డోలేంద్ర

ప్రతిపత్తి సాధించి పెట్టారు. ఏ మంత్రో, శాసన సభ్యుడో పబ్లిసిటీ స్టంట్‌గా ఇచ్చిన పట్టా కాగితం ముక్కలను చూసుకొని, మురిసి పోవడం తప్ప, తమకంటూ కేటాయింప బడిన భూముల్లో అర్థ శేరు బియ్యం గింజలు కూడా పండించు కోలేని నిర్భాగ్య జీవులను అర్జున రావు దేముడి వలె ఆదుకున్నారు. ఆయనిచ్చిన మోటార్లు, ఆయిలింజన్లు, త్రవ్వించిన బావులు ఇప్పటికీ కొన్ని వేల కుటుంబాలకు జీవనాధారం కల్పిస్తున్నాయి. వ్యవసాయ కూలీలుగా గతించి పోవలసిన వారిని, రైతులుగా గుర్తింపజేసి, సాంఘిక హోదా కల్పించిన ధన్యజీవి అర్జున రావు. నెల్లూరు వదిలిన తర్వాత ఆయన ఎన్నెన్నో ఉన్నత పదవులు అనుభవించి వుండవచ్చు. కాని, నెల్లూరు కలెక్టర్‌గా ఆయన సముపార్జించుకున్న కీర్తి ఒక్కటే చిరస్థాయిగా నిలుస్తుంది.

అర్జున రావు నిరుపేద హరిజనులకు ఆర్థిక స్వావలంబన సాధించి పెట్టడానికి యత్నిస్తే, కె. రాజా వారిలో సామాజిక చైతన్యం తీసుక రావడానికి చిత్తశుద్ధితో కృషి చేశారు. కలెక్టర్‌గా నెల్లూరులో వున్న రెండున్నర సంవత్సరాలలో రెండు రాత్రులైనా

కొరవ 7 పేజీలో

# "మహాకవుల మాటల వెంట అర్థం పరుగు పెడుతుంది"

## సాహితీ కాలక్షేపం

పాకాల వెంకటకృష్ణయ్య

"వాక్యం రసాత్మకం కావ్యం" అని అలంకారికుల అభిభాషణ. ఒక్క వాక్యంలో కావ్య గుణాలను చొప్పించి మెప్పించటం అసాధ్యం - కొమ్ములు దిరిగిన కవికైనా సరే! ఇక, వాక్యంలో రసాన్ని నింపటానికి అది - లోటానో, చెంబో కాదు; 'రసం' చారో, సాంబారో కాదు.

"రసం" హైయక్తిమైన హృదయాను భూతి. దీని 'స్థాయి' అయా వ్యక్తుల చిత్త సంస్కారాన్ని బట్టి ఉంటుంది. దీన్ని ఇది అని తేల్చి చెప్పడం సాధ్యపడదు. భాషకు అందదు; నిర్వచనానికి లొంగదు. అందువల్లనే దీన్ని బ్రహ్మానందానికి సైదోదు అన్నారు.

రసప్రక్రియ చాలా క్లిష్టమైంది; సుస్నితమైంది కూడా. అనేక భావాల మేలి కలయిక చేసే ఇంద్రజాలం రసావిర్భావం. మౌనం దీనిభాష; ఇంత మహోత్కృష్టమైన ప్రక్రియ ఒక్క వాక్యంలో ఒదిగి పోగలదా? మరి, అలంకారికులు చెప్పింది తప్పా? కాదు; వాళ్లు చెప్పింది ఒప్పే. ఇక్కడ "వాక్యం" అనే మాట పారిభాషికం అని ఉదాహృత గ్రంథాన్ని (రామాయణం) బట్టి గ్రహించవచ్చు. అయితే ప్రతిభా వంతుడైన కవి సమున్నతమైన భావ సమన్విత వాక్యాన్ని చెప్పి, 'సహభావ' అనిపించు కోగలడు. దీనికి దృష్టాంతమే కాలోజీ ఎలిజీ.

"Brevity is the soul of wit" పరసమైన సాహిత్యానికైనా, చెప్పిది శాస్త్రానికైనా 'ముక్తసరి' ముద్దు - విపరణలు, పూరణలు పండిత విమర్శకుల సొత్తు.

ఎలిజీ ఆంగ్ల సాహిత్యంలో ఒక ప్రక్రియ. కవికి - లేక పది మందికి ప్రేమ పాత్రుడైన వ్యక్తి మరణించి నప్పుడు - కవి గుండె లోతుల్లో రేగిన చిన్న గాయం దీనికి ఊపిరి.

ఆధుని కాంధ్ర కవులు ఈ ప్రక్రియను ఆంగ్ల సాహిత్యం నుంచి తెరవాటు కొట్టిన మాట నిజమే. కాని మన ప్రాచీన సాహిత్యంలో కొద్దిగానైనా ఎలిజీలు లేకపోలేదు. ప్రాచీనులలో శ్రీనాథుడు వీరభద్రా రెడ్డి మరణించి నపుడు రాసిన సీస పద్యం ఎలిజీయే. రాయలు పరమ పదించిన తర్వాత అల్లసాని పెద్దన ఒకే ఒక సీసంలో ఎలిజీని మూసపోశారు.

ఆధునిక కవులలో శ్రీశ్రీ రాసిన ఎలిజీ సుప్రసిద్ధమే. కీ.శే. విశ్వనాథ సత్య

కొరవ 10 పేజీలో

# చక్కెర ఫ్యాక్టరీ పీక నులమడమే ధ్యేయమా?

మాజీ చక్కెర మంత్రి ప్రసన్న కుమార రెడ్డి గారి పుణ్యమా అని ఇప్పటికి సగం చచ్చిన కోవూరు చక్కెర ఫ్యాక్టరీకి, కొరవా సరవా గొంతు నులిమి ఊపిరి తీసేస్తున్నారు అధికారులు. ఏ తప్పుడు పని చేసి ఎంత దిగమ్రింగు దామా అన్న యావ తప్ప, వెయ్యి మందికి పైగా రైతుల భవిష్యత్‌తో ముడిపడిన ఈ సహకార సంస్థను పది కాలాల పాటు నిలబెడదామన్న ఆలోచనే వారిలో కల్గడం లేదు. సామంతు సుబ్బారెడ్డి గారు ఛైర్మన్‌గా వున్న ఆరేళ్ల పాటు తన అబ్బది పోయినట్లు

> **రైతుల నోళ్లు కొట్టి, అధికారులు బొజ్జలు పెంచు కుంటున్నారు!**

ప్రాకులాడి, నానా పాట్లు పడి, నష్టాల ఊబిలో గొంతు వరకు పూడుకొని పోయి వుండిన ఫ్యాక్టరీని గట్టుకు లాగి, రైతులకు మనశ్శాంతి చేకూరిస్తే - ఇప్పటి అధికార గణం ఆరు నెలల్లో ఆ కృషిని బూడిద పాలు చేసేస్తున్నది.

ఫ్యాక్టరీ నిర్వహణలోని అవక తవకలు, రైతులకు చెరకు తోలిన బాకీలు చెల్లించ లేని గడ్డు పరిస్థితులను విస్మరించి, వున్న కొద్ది డబ్బును ఫ్యాక్టరీ ఆవరణం తళుకులకు, షోకులకు దుబారా చేసేస్తున్నారు అధికారులు. ఒక్కొక్కటి 90 వేల లెక్కన, లెక్కకు మించిన పనులు సృష్టించి, నామినేషన్ల క్రింద కాంట్రాక్టులు పంచి, బొక్కసాన్ని పూరా బొక్కేస్తున్నారు. ఫ్యాక్టరీ గేటు దగ్గర స్వాగత ఆర్చీ, మేనేజింగ్ డైరక్టర్ గారి గదికి వెళ్లే బాటకు తారు రోడ్డు, సైకిల్ షెడ్డు నిర్మాణం వంటి దండగ మారిన పనులు సృష్టించి, కాంట్రాక్టులు పంచేశారు. ఫ్యాక్టరీలో నిజంగా మిగులు నిధులు వుంటే చేయదగిన అభివృద్ధి కార్యక్రమాలు చాలానే వున్నాయి. చెరకు తోలుకొని వచ్చే ట్రాక్టర్లు, లారీల డ్రైవర్లు, రైతులకు ఆ ప్రాంతంలో నిలువ నీడే లేదు. ఒక్కొక్కసారి క్రషింగ్ గేటు వద్దకు పోవడానికి రైతులు తమ ట్రాక్టర్ల దగ్గరే 24 గంటలకు పైగా వేచి వుండ వలసి వస్తుంది. అంత సేపూ ఎండకు ఎండుతూ, వానకు తడుస్తూ నిల బడాల్సిందే తప్ప కూర్చోవడానికి కూడా చోటు వుండదు. అక్కడ రైతులకు, డ్రైవర్లకు ఒక విశ్రాంతి షెడ్ కట్టిస్తే వారెంతో పొంగి పోతారు. ఆఫీసులోనూ రైతులకు వెయిటింగ్ హాలు లేదు. బిల్లుల కోసం, ఇతర పనుల మీద వచ్చే వారు చెట్ల క్రింద తారాడాల్సిందే. బగాసీ, మొలాసెస్‌లు తోలేందుకు దారి లేదు. ఆ లారీలు పడే అవస్థలన్నీన్నీ కావు. ఇటు వంటి రైతు ప్రయోజనకర కార్యక్రమా లన్నింటినీ వదిలేసి, ఎమ్‌డి గారి కారుకు తారు రోడ్డు, గేటుకు స్వాగత తోరణం కట్టించ వలసిన అవసరం ఎందుకు వచ్చింది ?

పైగా ఈ పనులు వేటికీ టెండర్లు పిలవ లేదు. అంతా నామినేషన్ల భాగోతమే. అందుకోసం పనులను 90 వేల పరిమితికి చిట్ల గొట్టారు. పని చేసినట్లు కాగితాల మీద చూపించి స్వాహా చేయాలనే దుర్బుద్ధి వుంటే తప్ప, ఇటు వంటి తప్పుడు మార్గ మనుసరించ వలసిన అగత్యం ఏముంది? జాయింట్ కలెక్టర్ గారు ఉద్దండులు; ఉక్కు పిండం. ఆయన దృష్టికి ఈ అక్రమ చర్యలు వెళ్లలేదా?

ఏ మాత్రం తెలిసినా చీల్చి చెండాడం తప్ప, ఉపేక్షించే తత్వం కాదే? ఇప్పటికైనా ఆయన జోక్యం చేసుకొని తక్షణం ఈ అవినీతికి ఫుల్‌స్టాప్ పెట్ట గల్గితే రైతులు మెచ్చు కుంటారు.

## కావలిలో ఆదర్శ వివాహం

కావలి హరిజన పాళెంకు చెందిన యు. వరలక్ష్మి, ఎం. చెన్నయ్యల ఆదర్శ వివాహం టౌన్ పెద్దల సమక్షంలో 25 తేది కారొనేషన్ రీడింగ్ రూంలో జరిగింది. మాజీ శాసన మండలి సభ్యులు ఎం. మాధవ రావు కార్యక్రమానికి అధ్యక్షత వహించగా, ఒపిడిఆర్ జిల్లా కార్యదర్శి బి. సుబ్బాద్రి నూతన దంపతుల చేత ప్రమాణ పత్రాలు చదివించారు. తదుపరి హిందూ సాంప్రదాయ రీతిలో మంగళ సూత్ర ధారణతో వివాహం ముగిసింది. మాజీ మునిసిపల్ ఛైర్మన్ డాక్టర్ ప్రభాకర నాయుడు, డాక్టర్ వెంకారెడ్డి, లాయర్ సి.హెచ్. వెంగళ్రావు, పోలీస్ సబ్ ఇన్స్‌పెక్టర్ రాంబాబు పెళ్లికి పెద్దలుగా నూతన వధూ వరులకు అండగా నిలుస్తా మన్నారు.



రాజరాజేశ్వరి శరన్నవరాత్రులను పురస్కరించుకొని దేవాలయం ముందు జాతీయ రహదారి పై కళ్లు మిరుమిట్లు గొలిపే విద్యుత్ దీపాలంకరణతో ఏర్పాటు చేసిన స్వాగత ద్వారాలు.

# రాజేశ్వరమ్మకూ కళ్లు చెదిరి వుంటాయి!

నెల్లూరు శ్రీ రాజ రాజేశ్వరి దేవాలయం తిరునాళ్లు మహా వైభవంగా జరుగు తూంది. ఆ వైభవం చూచి ఆనందించాలే కాని వర్ణించ డానికి మాటలు చాలవు. చూడడానికి రెండు కళ్లు చాల వంటుంటారే - అట్టి వుంది వైభవం.

రాజేశ్వరి దేవాలయం జిల్లాలో అతి క్రొత్త దేవాలయం. రంగనికి, జొన్నవాడ కామాక్షమ్మకు వున్నట్లు ఈ గుడికి స్థల పురాణం లేదు; వర మహాత్మ్యలు లేవు; ఆస్తిపాస్తు లసలే లేవు. కనీసం విశాలమైన చోటు కూడా లేదు. వున్నదల్లా ధర్మకర్తల మండలి అధ్యక్షుడు శ్రీ కె.వి. రాఘవ రెడ్డి కృషి, పట్టుదలలు మాత్రమే! రోడ్డు ప్రక్కన దారిన పోయే వారు దండం బెట్టుకొనే చిన్న గుడిగా వుండిన దీన్ని జిల్లాలోని ప్రసిద్ధ, పురాతన దేవాలయాలకు ధీటుగా, జనాకర్షణలో వాటికి తలమానికంగా తయారు చేశాడు రాఘవ రెడ్డి. ఎంతో చిత్తశుద్ధి, పట్టుదల వుంటేనే కాని, శక్తికి మించి శ్రమ పడితే కాని ఈ విజయం సాధించలేరు.

ఈ ఏడాది రాఘవ రెడ్డి తన విశ్వ రూపం ప్రదర్శించాడు. విద్యుద్దీపాలంకరణలతో చూపరుల 'కళ్లు బైర్లు' క్రమ్మేట్లు చేశాడు. రాజ రాజేశ్వరి దేవికి కూడా ఆ అలంకరణలు చూసి కళ్లు చెదిరి వుంటా యనడం అతిశయోక్తి కాదు.

> **సింహపురిని సమ్మోహన పరచిన దీపాల తోరణాలు**

రోడ్డు ప్రక్కనే వుండడంతో, జాతీయ రహదారిపై వెళ్లే వారు వాహనాలు ఆపి మరీ ఆ ఉబ్బురం తిలకిస్తున్నారు. తిరునాళ్లకు వచ్చిన భక్తులు, లోపల . అమ్మవారిని దర్శించడం మర్చిపోయి జిగేల్మనే దీపాల మాయను నోరెళ్ల బెట్టి చూస్తూ వాకిటనే నిలబడి పోతున్నారు. ఈ

కొరవ 7 పేజీలో

# కానిస్టేబిల్‌కు నీతా- హమ్మో! ఎంత ధైర్యం?

నిజాయితీ పరులకు తిప్పలు తప్పవు; అందులోనూ పోలీస్ డిపార్టు మెంట్‌లో నిజాయితీ పరులు బతికి బట్ట కట్టలేరు. ఈ నిజం రాపూరు పోలీస్ స్టేషన్‌లో కొత్తగా కానిస్టేబిల్‌గా చేరిన శ్రీనివాసులు రెడ్డికి తెలియలేదు. సమాజానికి పోలీసుగా మేలు చేయాలనే తపన అతనిలో జాస్తి. కానిస్టేబిల్‌గా తన పరిధి చిన్నదైనా డ్యూటీలో చేరిన పది నెలల్లోనే రాపూరులో చాలా కేసులు పట్టు కున్నాడు. చౌక ధర దుకాణాల నుంచి అర్ధ రాత్రి అక్రమంగా బ్లాక్ మార్కెట్‌కు తరలి వెళుతున్న బియ్యం, దొంగ సారా, మద్యం, చిల్లర దొంగలు, లైసెన్సులు లేకుండా తిరుగుతున్న వాహనాలు, జులాయి రాయుళ్ల పని పట్టడం ఉదయం నుండి సాయంత్రం వరకు అతని డ్యూటీ. ప్రతి తప్పుడు పనికీ, దొంగ వెధవకూ ఏదో ఒక రాజకీయ సంబంధం వుండడం వల్ల ప్రతిసారీ అతడి పై నిప్పులు కురిపించే వారు. కొత్త ప్రభుత్వం రాగానే అధికార పార్టీకి చెందిన ఒక నాయకుడు ఈ చిన్న కానిస్టేబిల్ బదలీని ప్రతిష్ఠగా తీసుకొని ఆ పని చేయించాడు. అఫ్టరాల్ కానిస్టేబిల్ అంత నిజాయితీగా పని చేయడమా, హమ్మో, ఎంత ధైర్యం? అని ఆగం చేశాడు! నిజాయితీగా పనిచేసే శ్రీనివాసులు రెడ్డి బదలీని ప్రజలు నిరసిస్తున్నారు. ఎస్‌పి గారు ఈ కానిస్టేబిల్ పని తీరును ఒక సారి సమీక్షించి, బదలీ రద్దు చేసి రాపూరులో తిరిగి నియమించి నిజాయితీ పరులైన కానిస్టేబుళ్లకు నైతిక మద్దతు ఇవ్వాల్సిన అవసరం ఎంతైనా వుంది.

## జిల్లా వార్తలు

## గూడూరు బైపాస్ రోడ్డు పై లారీ హైజాక్

మద్రాస్ నుండి విశాఖ పట్నం పోతున్న ఎఐకె 7079 నెంబరు గల లారీని గుర్తు తెలియని వ్యక్తులు గూడూరు బైపాస్ రోడ్డు వద్ద హైజాక్ చేసారు. 26 తేది వేకువ జామున అంబాసిడర్ కారును అడ్డంగా ఆపి డ్రైవర్, క్లీనర్లను కత్తులతో గాయపరచి లారీని తీసుకెళ్లి పోయినట్లు గూడూరు పోలీసులకు ఫిర్యాదు అందింది. ఈ పార్సిల్ లారీలో అత్యంత విలువైన సరకు వుండడంతో మద్రాస్ స్మగ్లర్లు ఈ పనికి పాల్పడి వుండవచ్చని అను కొంటున్నారు. ఈ మిస్టరీ వెనుక

కొరవ 7 పేజీలో

# నెల్లూరు చుట్టుపక్కల్లో

## విహంగ వీక్షకుడు

### నెల్లూరుకు ప్రధాని- ఇఫ్‌కో శంకుస్థాపన

ఇఫ్‌కో ఛైర్మన్ శ్రీ పెళ్లకూరు ...మచంద్రా రెడ్డి గారి పదవే కాదు, ...కీయ జీవితం కూడా చరితార్థ ...ంది. నెల్లూరు జిల్లాలో 1400 కోట్ల ...య్యతో నిర్మించనున్న భారీ ఎరువుల ...ర్మాగారానికి అనుమతి, నిధులు ...ధించారు. నవంబర్ 3వ వారంలో ...ో ఒక తేదీన ప్రధాన మంత్రి శ్రీ పి.వి. ...రసింహా రావు ఈ ఫ్యాక్టరీకి శంకుస్థాపన ...యడానికి నెల్లూరు రానున్నారు.

రామచంద్రా రెడ్డి గారి కృషి, పట్టుదల వల్లనే ఈ ఫ్యాక్టరీ నెల్లూరు జిల్లాకు తరలి వచ్చింది. లేకుంటే ఏ ఉత్తర భారత రాష్ట్రానికో తరలి పోయి వుండేది. ఇఫ్‌కో అధికారులకు, భారత దేశంలో నెల్లూరు అనే జిల్లా ఒకటి వుందనే తెలియదు. రామచంద్రా రెడ్డి గారి ఛైర్మన్ పదవే వారికా జ్ఞానం ప్రసాదించిందనాలి. లేకుంటే నెల్లూరులో 1500 కోట్ల ఫ్యాక్టరీ ఏమిటి? విచిత్రమైన విషయమే కదా ఇది? నెల్లూరు జిల్లా పారిశ్రామి కీకరణ తీరు తెలిసిన వారికి నమ్మ శక్యం కాని విషయం. వెయ్యి మందికి పైగా ఉపాధి లభింప జేయనున్న పెళ్లకూరు పేరు పది కాలాల పాటు గుర్తు పెట్టు కుంటారు జిల్లా వాసులు.

### జానకి రాం జారుకున్నట్లేనా?

ఎన్‌టిఆర్ గూటికి వలస వెళ్లే జిల్లా కాంగ్రెస్ పక్షుల్లో మాజీ మంత్రి శ్రీ మాదాల జానకి రాం మొదటి వరుసలో వున్నట్లు వినికిడి. ఆయన ఇప్పటికి నాలుగు సార్లకు పైగా ఎన్‌టిఆర్‌ను కలిశారు. చర్చలు, ఒప్పందాలు, నిర్ణయాలు అన్నీ అయిపోయాయి; లాంఛన ప్రాయపు ప్రకటనే ఆలస్యం అంటున్నారు.

జానకి రాం రాజకీయ స్థానం ఉదయగిరి. కానీ కాంగ్రెస్‌లో వుండి అక్కడ బ్రతికి బట్ట కట్టడం ఆయనకు కష్టంగా వుంది. ఉదయగిరిలో పార్టీల కంటే కులాల ప్రభావం ఎక్కువ. తాను కమ్మ అయినప్పటికీ, స్థానిక కమ్మ కులస్తులు తెలుగు దేశం వైపే ఆకర్షింప బడుతున్నారు. రెడ్లను తనకు వ్యతిరేకం చేయడంలో రాజ మోహన రెడ్డి సఫలీ కృతుడైనారు. తానిట్లా రెంటికీ చెడిన రేవడిగా వుంటే రాజకీయ భవితవ్యం శూన్యమన్న భీతి జానకిరాంలో చాలా కాలం నుంచి వుంది. ఎన్‌టిఆర్ అల్లు ళ్ళు కావడం తన అదృష్టంగా భావిస్తు న్నట్లున్నాడాయన.

ఎన్‌టిఆర్‌కూ జానకి రాం వంటి మంత్రాంగం నడప గల రాజకీయ కోవిదుల అవసరం వుంది. ఉభయ తారకమైన ఈ వలస వార్త త్వరలోనే వింటాం మనం!

* * *

నెల్లూరు నుంచి ఇంకెవ్వరు వెళ్ల బోతున్నారు ఆ గూటిలోకి? ఆనం రామ నారాయణ రెడ్డి పేరు జనం నోళ్లలో నానుతూంది. ఆయన మాత్రం "అబ్బే, అటు వంటిదేమీ లేదంటున్నారు. కాని రాజకీయ వాదుల మాటలకు అర్థాలు వేరు కదా? నిప్పు లేనిదే పొగరాదు.

గత పార్లమెంట్ ఎన్నికల సమయంలో కాంగ్రెస్‌లో చేరినప్పటికి రామనారాయణ రెడ్డి కాంగ్రెస్‌లో ఇప్పటికి "ఫారినరే"; ఇక్కడ ఇమడడం ఆయనకు కష్ట...ంది. కరెంట్ లేని గదిలో మధ్యాహ్నం పూట కూర్చో బెట్టినట్లు ఉక్క పోతుతో అసహనంగా వున్నాడు. పై పెచ్చు తన రాజకీయ మిత్రు లందరూ తెలుగు దేశంలోనే వున్నారు.

అయితే నమ్మి వచ్చినందుకు కాంగ్రెస్ పార్టీ రామనారాయణకు అన్యాయమేమీ చేయలేదు. రాపూరు టిక్కెట్ ఆయనకే వచ్చింది. రేపూ అందులో మార్పు వుండక పోవచ్చు. దానికి తోడు తన అన్నలిద్దరూ కాంగ్రెస్‌లో పదవుల్లో వున్నారు. అందువల్ల తొందరపడి నిర్ణయం తీసుకోడనే భావించాలి.

గవర్నర్ చెన్నారెడ్డి గారి శిష్య పరమాణువు కోటంరెడ్డి విజయకుమార్ రెడ్డి ఉరఉర లాడుతున్నాడట. అతడి ఆలోచనకు అర్థం వుంది. టౌన్‌లో ఎంత గొప్ప పిల్ల సైన్యాన్ని పెంచుకున్నా టిక్కెట్ల దగ్గర గొప్పేసరికి విజయ కుమార రెడ్డిని పట్టించుకొనే వారేలేరు. చెన్నారెడ్డి గారు చేయగల్గిన సాయమూ లేదు. ఎన్టీఆర్ ఇంట్లో దూరి ధాన్ను తగిలితే అదృష్టమే కదా?

### కొట్టలేదు- తిట్టుకున్నామంతే!

విఆర్ కాలేజిలో అయ్యవార్ల ఘర్షణ, ట్యూషన్ల వివాదం పై గత వారం మా వార్త, వ్యాఖ్యలు లెక్చరర్ల మనసు కష్టం కల్పించి నట్లున్నాయి. పది పేజీల సుదీర్ఘ వివరణలో తమ బాధనంతా వ్యక్తం చేశారు. డిగ్రీ కాలేజి డన్ నారాయణ రెడ్డిని ఇద్దరు కామర్స్ లెక్చరర్లు కొట్టినట్లు వ్రాసిన వార్త నిజం కాదని; నారాయణ రెడ్డి అకారణంగా, అసందర్భంగా బూతు పద ప్రయోగంతో అయ్యవార్లను అవమాని స్తుండడంతో, ఓర్చు పట్టలేక గట్టిగా అభ్యంతరం చెప్పడం జరిగిందే తప్ప, కొట్టలేదని చెప్తున్నారు. నారాయణ రెడ్డి గారి అతి పెత్తనం సహించ లేకనే ఈ దూకుడుకు పాల్పడ వలసిందని, అంతకంటే మరే వుద్దేశ్యలూ లేవని అయ్యవార్లు వివరించారు.

పత్రికలే కాదు, కలెక్టర్ గారూ లెక్చరర్లను క్రిమినల్స్ అని తిట్టడం భావ్యం కాదని వీరి ఆవేదన.

లెక్చరర్లను కించ పరచడం మా వుద్దేశ్యం కాదు; ఘర్షణలోకి దిగి తమను తాము కించ పరచు కున్నారన్న బాధతోనే అట్లా వ్రాయవలసి వచ్చింది. మా వార్తలో తప్పు, తొందర పాటు వుంటే క్షమాపణ చెప్పడానికి మా కభ్యంతర మేమీలేదు. కానీ ఆ అవసరం లేదనే భావిస్తున్నాము.

### సిపిఎంకు మళ్లీ జక్కా నాయకత్వం

నెల్లూరు జిల్లా సిపిఎం కమిటీ కార్యదర్శిగా ఎమ్మెల్యే శ్రీ జక్కా వెంకయ్య ఎంపికైనారు. ఆయన నాయకత్వం ప్రశ్నింప రానిదిగా పరిగణింప బడింది. పై పెచ్చు వెంకయ్య గారి కంటే పార్టీ పట్ల నిబద్ధత కల్గిన వారు, సిద్ధాంతాలు చదివిన వారు, సీనియర్లు మరెవరూ పార్టీలో లేరు. ఇది ఆయనకు ఐదవ పర్యాయం, ఈ పదవి దక్కడం.

గూడూరులో 23, 24 తేదీలలో జరిగిన పార్టీ మహాసభలలో ఈ ఎంపిక జరిగింది. తక్కిన కమిటీ సభ్యులు వీరూ - టి.పి. భానురాజా, నారు కృష్ణయ్య, చిట్టేటి రమణా రెడ్డి, కె. జనార్ధన్, చంద్ర రాజగోపాల్, ఐ. జనార్దన రెడ్డి, బి. మాలకొండా రెడ్డి.

### మునిసిపల్ సమావేశం

మునిసిపల్ సమావేశ మందిరంలో ఛైర్ పర్సన్ ఆనం వివేకానంద రెడ్డి అధ్యక్షతన 30 తేది సాయంత్రం 4 గంటలకు కౌన్సిల్ సమావేశం జరుగు తుంది. అజెండాలో 109 అంశాలు చర్చకు రెడీగా వున్నాయి.

### కవికోకిల శతజయంతి సన్నాహక సమావేశం

తెలుగు కవితా జగత్తులో, నెల్లూరుకు అంతర్జాతీయ ఖ్యాతి చేకూర్చిన కవికోకిల దువ్వూరి రామిరెడ్డి పుట్టి నవంబర్ 11కు నూరేళ్లు నిండుతున్నాయి. ఈ సందర్భాన్ని పురస్కరించు కొని శతజయంతిని ఘనంగా జరపాలని రామిరెడ్డి విజ్ఞాన

కొరవ 7 పేజీలో

## సఖుగుడు

4 పేజీ కొరవ

ఆయన కంటి నిండా నిద్ర పోయి వుంటారా అన్నది సందేహమే. ఏదో తెలియని తపన, అశాంతి ఆయనలో ప్రస్ఫుటించేవి. స్పష్టమైన ఆశయాలు, వాటిని నెరవేర్చ దానికి ఆవేశం, పట్టుదల, చిత్తశుద్ధి, తన మార్గానికి ఏ ఆటంకాలూ ఎదురు కాకుండా చూసుకో గల్గిన లౌక్యం, రాత్రనక పగలనక కష్టించి పనిచేయు గల్గిన ఓర్పు, సహనం, దీక్ష రాజా గారిలో మూర్తీభవించి వుండేవి. అక్షరాస్యతా ఉద్యమం, హాస్టల్ల పిల్లలకు ట్యూషన్లు, పేదల భూములకు నీటి పారుదల వసతి కల్పన వంటి కార్యక్రమాలెన్నో చేపట్టి దిగ్విజయంగా పూర్తి చేశారు. ప్రపంచం యావత్తునూ దిగ్భ్రాంతి పరచిన సారా వ్యతిరేక ఉద్యమాన్ని సంకల్పించింది, రూపకల్పన చేసింది, దాన్నొక సామాజిక విప్లవంగా భవిష్య ద్దర్శనం చేసింది రాజా గారే.

ఆయన అందించిన కరదీపిక వెలుగులో, ఆయన నుంచి పొందిన ఉద్యమ నిర్వహణ శిక్షణతో సారా ఉద్యమానికి ప్రపంచ ప్రాచుర్యం కల్పించిన వారు శ్రీ సాంబశివ రావు. అసాంఘిక శక్తుల దాడుల నుంచి, రాజకీయ వాదుల ప్రలోభాల నుంచి, పోలీసు లాఠీ ప్రతాపం నుంచి ఉద్యమ కార్యకర్తలను రక్షించడంలో సాంబశివ రావు గారు చూపిన తెగువ, సాహసం ప్రశంస నీయం. నవ్వు ముఖంతో, నొప్పించక తానొవ్వక జిల్లా పాలనా యంత్రాంగం సమస్తాన్నీ తన ఉద్యమాల ప్రాభవానికి వినియోగించారు సాంబశివ రావు గారు. ఆయన ప్రారంభించిన పొదుపు లక్ష్మి ఇప్పటికీ పల్లెల్లో నిరుపేద మహిళలకు తారక మంత్రం వలె పనిచేస్తున్నది.

వీరందరి ఉద్యమాలూ పల్లెలకు, పల్లెల్లోని బడుగు జీవులకు పరిమితమైతే, ఇప్పటి కలెక్టర్ శ్రీ గిరిధర్ ఉద్యమావేశం నగరాల నడిబొడ్డున సరస్వతీ దేవికి జరుగుతున్న అపచారానికి మంగళం పాడేందుకు పనికి వస్తున్నది. ట్యూషన్ల దూర్వ్యాపారం పై ఆయన ప్రారంభించిన ఉద్యమం రెండు మూడు వారాలలోనే సత్ఫలితాల నివ్వడం విశేషం.

ట్యూషన్ల సమస్య ఈనాటిది కాదు. ని ఘండుకొా లొంగని దీర్ఘ వ్యాధి వలె ఏళ్ల తరబడి విద్యా వ్యవస్థను పట్టి పీడిస్తున్నదది. విద్యార్థి దశలో గిరిధర్ కూడా ట్యూషన్ల బాధితుడుగా వున్నట్లుండి. ఆ స్వానుభవంతో చదువు లమ్ముకునే అయ్యవార్ల మీద ఎకాఎకిన దండయాత్ర చేశారాయన. దెబ్బకు దెయ్యం జడుస్తుం దంటారు. కలెక్టర్ కరుకు ధోరణికి అయ్యవార్లు విజంగానే జడిశారు. శాసిలో ఎక్కడి ట్యూషన్లు అక్కడే బంద్ అయిపోయాయి. కాలేజీలలో వసేదెన్నూ, ట్యూషన్లు చెప్పే అయ్యవార్ల పట్ల చుట్టుప్రక్కల వారిలో ఒక విధమైన అయిష్టతా భావం, ఏవగింపు కల్గేలా చేశారు కలెక్టర్ గారు. అదొక సామాజిక నేరంగా గుర్తింప బడేటట్లు ప్రచారం కల్పించారు. ఫలితం - అయ్యవార్లు తమ చదువు లంగళ్లకు పట్టర్లు దించి వేయడం.

అయితే కేవలం దండ ప్రయోగంతో, బెదురు పుట్టించే వైఖరితో ఇటువంటి దురలవాట్లు మాన్పించడం కష్టం. దాని ఫలితాలు తాత్కాలికంగానే వుంటాయి. నయంతో ఒప్పించి దారికి తెగల్గితే అది చాలా కాలం నిలుస్తుంది.

కలెక్టర్ గారి చనువును విద్యార్థి సంఘాల నాయకులు కొందరు అతిగా దుర్వినియోగం చేస్తున్నట్లుంది. వారికి కొంచెం కళ్లెం బిగించాలి. మధ్యలో ట్యూషన్లు ఆగిపోయి, విద్యార్థులు ఇబ్బందులు పడకుండా కాలేజీలలోనే ఉచిత కోచింగ్ ఇప్పిస్తా మంటున్నారు కలెక్టర్ గారు. రెండేళ్ల క్రితం వి ఆర్ కాలేజి అయ్యవార్లు స్వచ్ఛంధంగా ఈ పని చేశారు కూడా! ఇటువంటి సేవా కార్యక్రమానికి లెక్చరర్ల సహకారం అవసరం. వారిని మంచి చేసుకొని, మన్నన ఇచ్చి ఈ పని చేయించాలి. బెదిరిస్తే ఎవరూ లొంగరు. కలెక్టర్ గారికి ఈ సూక్ష్మం తెలియ కుండా వుండదనుకోండి!





## రాజేశ్వరమ్మ

5 పేజీ కొరవ

విద్యుద్దీప తోరణాల రూపశిల్పి - భీమ వరానికి చెందిన వాడట. అతడిలో ఎంతో కళా హృదయం, రసజ్ఞత, దార్శనికత వుంటేనే కాని అంతటి సమ్మోహన అలంకరాలు సృష్టించడం వీలు పడదు. అతడ్ని ఎలక్ట్రీషియన్ అంటే అవమానించి నట్లవుతుంది; కరెంటు దీపాల కళా కారుడనడం సమంజసం.

అలంకరణల ఆకర్షణో లేక అమ్మవారి ఆలయ పవిత్రతో తెలియదు గాని ఈసారి భక్తుల సంఖ్య కూడా అపారం. పొద్దుట నుంచి రాత్రి వరకు ఎడ తెరిపి లేని జనం.

దీనికి తగ్గట్లు ఆలయ ఆదాయం సైతం అమాంతం పెరిగి పోతూంది. నవరాత్రుల పూజలకే లక్షకు పైగా వచ్చిందట. ఛైర్మన్‌గా తాను పదవీ స్వీకారం చేసే నాటికి స్వీపర్ల జీతాలివ్వ డానికి హుండీ తెరవాల్సిన పేదరికంలో వుండిన దేవాలయాన్ని ఏటా పదిహేను లక్షల వరకు ఆదాయం వచ్చే విధంగా అభివృద్ధి చేశారు రాఘవ రెడ్డి. రాఘవ రెడ్డికి మన అభినందనలు అవసరం లేదు; ఆ రాజేశ్వరమ్మ ఏదో ఒక రూపంలో కరుణించి తీరుతుంది.

## జిల్లావార్తలు

5 పేజీ కొరవ

విషయాన్ని శోధిం చేందుకు గూడూరు టూ టౌన్ ఎస్ఐ వెంకట్రామి రెడ్డి ఆధ్వర్యంలోని ప్రత్యేక పార్టీ విచారణకు బయలు దేరింది. ఈ విధంగా గూడూరు పరిసర ప్రాంతాల్లో లారీ హైజాక్ కావడం ఇదే మొదటి సారి కావడంతో ఈ విషయం చర్చ నీయాంశ మయ్యింది.

## యల్లాయపాళెంలో లయన్స్ కంటి చికిత్స

నెల్లూరు లయన్స్ క్లబ్ ఆధ్వర్యంలో యల్లాయ పాళెం గ్రామంలో 23 తేది నుండి 5 రోజుల పాటు ఉచిత కంటి శస్త్ర చికిత్సా శిబిరం జరిగింది. 23 తేది 500 మందికి కంటి పరీక్షలు నిర్వహించి అవసరమైన వారికి మందులు ఇచ్చారు. 24 తేది 90 మందికి కంటి ఆపరేషన్లు నిర్వహించారు. ఆ నాలుగు రోజులూ ఆపరేషన్లు చేయించుకొన్న వారికి, వారితో వున్న సహాయకునికి వుచిత భోజన వసతులు కల్పించారు. 28 తేది జరిగిన ముగింపు సభలో లయన్స్ డిస్ట్రిక్ట్ గవర్నర్ వై.వి. ప్రభాకర రెడ్డి, వైస్ డిస్ట్రిక్ట్ గవర్నర్ వై. సురేష్, అసోసియేట్ గవర్నర్ ఎన్.సి. సుబ్బారావు, జోన్ ఛైర్మన్ ఎ. సత్యనారాయణ పాల్గొన్నారు. ఈ శిబిరంలోనే ఐదు రోజులు బస చేసి పి. ఆంజనేయులు, షేక్ కరీముల్లా దగ్గరుండి ఏర్పాట్లు చూసారు. డాక్టర్లు కె. సుధాకర రెడ్డి, కృష్ణమూర్తి బృందం ఆపరేషన్లు చేయగా, హోటల్ శివం అధినేత వై. సురేష్ ఉచితంగా కంటి అద్దాలు ఇచ్చారు. శిబిరం ఖర్చులను లయన్ బి. జనార్ధన రెడ్డి భరించారు. కార్యక్రమంలో క్లబ్ అధ్యక్షుడు బి. పాండురంగం, కార్యదర్శి ఐ. ఉదయ భాస్కర రావు కూడా పాల్గొన్నారు.

## నెల్లూరు ముచ్చట్లు

6 పేజీ కొరవ

సమితి తలపోసింది. ఏర్పాట్ల పై అక్టోబర్ 10తేది టౌన్ హాల్ రీడింగు రూంలో సన్నాహక సమావేశాన్ని బెజవాడ గోపాల రెడ్డి అధ్యక్షతన ఏర్పాటు చేస్తున్నారు. సాహిత్యాభి మానులు, శ్రేయోభి లాషులు విచ్చేసి సలహాలు, సహాయం చేయ మంటున్నారు సమితి కార్యదర్శి అగస్త్యరెడ్డి వెంకురెడ్డి.

### వేరుశెనగనూనె ఇక కేజి 38 రూపాయలే!

నిత్యావసర వస్తువుల చట్టాన్ని తాత్కాలికంగా నిలుపు దల చేస్తూ ముఖ్య మంత్రి చంద్రబాబు నాయుడు తీసుకొన్న నిర్ణయానికి ' జిల్లా ఆయిల్ మిల్లర్స్ వెల్ఫేర్ అసోసి యేషన్ సానుకూలంగా స్పందించి, తమ వంతుగా నూనె ధర తగ్గించింది. ప్రస్తుతం 42 రూపాయలున్న వేరు శెనగ నూనె కిలో ధరను 38 రూపాయలకు స్వచ్ఛందంగా తగ్గించే నిర్ణయం తీసుకొన్నట్లు సంఘం అధ్యక్షుడు నన్నపురెడ్డి పెంచలు రెడ్డి చెబుతున్నారు. ఆయిల్ మిల్లర్లకు ఇటువంటి మంచి బుద్ధి పుట్టినందుకు ప్రజలు అభినందించక మానరు.

### లయన్ ఉచిత రక్త గ్రూపు పరీక్ష

రక్తం గ్రూపు తెలును కోవాలంటే ఈ రోజుల్లో ఖర్చుతో కూడిన వ్యవహారం. పైసా ఖర్చు లేకుండా అంతర్జాతీయ రక్త దాన దినోత్సవం సందర్భంగా 1తేది నెల్లూరు లయన్స్ క్లబ్ ఉచిత రక్త గ్రూపు పరీక్షలు చేయించే ఏర్పాటు చేసింది. గాంధీ బొమ్మ సెంటర్‌లో షామియానా వేసి ఉదయం 10 గంటల నుండి ఈ పరీక్షలు చేస్తా

జమీన్‌రైతు

సంవత్సర చందా రూ. 100/-

అర్ధ సంవత్సర చందా రూ. 50/-

విడిప్రతి రూ. 2/-

# పౌరులు లేని పౌర సన్మానం జరపనేల?

22.9.1995 తేది జమీన్‌రైతు ఫ్రంట్ పేజి పతాక శీర్షిక నాకు బాగా నచ్చింది. వివేక వంతులకు, ఆలోచనా పరులకు అందులోని గూఢార్థం అవగాహనలోకి రాకుండా వుండదు. ఆతిధ్య సేవలతో, అలంకారా డంబరాలతో, ఛైర్మన్ల సదస్సును "డంగ్" చేసి చరిత్ర సృష్టించారు ఆనం వివేకానంద రెడ్డి అని వ్రాశారు. మహాశయా - "డంగ్" అంటే అర్థమేమిటి? "డంగై" పోయారంటే ఏమను కోవాలి? ఈ పదం ఆంగ్ల భాషా, లేదా ఏ భాషకు చెందినది?

ఆంధ్ర రాష్ట్రంలో మునిసి పాలిటీలు ఆర్థిక ఇబ్బందులతో, అసమర్థ పరిపాలనతో, పన్నుల వసూళ్ల వైఫల్యాలతో సతమత మౌతున్న సమస్యలను మునిసిపల్ మంత్రి గారి ప్రత్యేక సమక్షంలో కూలంకషంగా చర్చించి, వాటి పరిష్కారానికి బాట సుగమం చేసింది ఈ సదస్సు అనే అభిప్రాయం కల్గడం లేదు.

వ్యక్తులు, గ్రూపు నాయకుల హోదాలను, తాహత్తులను, శక్తి సామర్థ్యాలను బలాలను ప్రదర్శించిన సదస్సుగా జరిగింది అనే అభిప్రాయం కొందరిలో కలగడంలో ఆశ్చర్యం లేదు. మునిసి పాలిటీలలో నివసించే పౌరులకు కావలసింది సౌకర్యాలు కాని, వ్యక్తుల ఆతిధ్యపు అతిశయాలు కాదు. ఈ సదస్సులో సమస్యల పరిష్కారం లేకపోగా, పాల్గొన్న వ్యక్తుల గౌరవ ప్రతిష్ఠలను, సమస్యల అవగాహనలో వారికి ఉన్నటు వంటి కుశాగ్రతలను నిరూపించిందని మాత్రం స్పష్టంగా చెప్పలేను.

మునిసి పాలిటీలు ఎదుర్కొంటున్న ఈనాటి ఆర్థిక సంక్షోభంలో, ఈ రాష్ట్ర సదస్సు నిరాడంబరంగా, ఒక కార్యాచరణ సదస్సుగా, విలాస వినోద కార్యక్రమాలు లేకుండా జరిగి వుంటే కొంత ఫలితం ఉండేది.

మునిసిపల్ మంత్రి శ్రీ తమ్మినేని సీతారాం గారికి నెల్లూరు మునిసిపాలిటీ "పౌర సన్మానం" చేసింది అని పత్రికా ముఖాన చదివాను. నేను నెల్లూరు పట్టణంలో విద్యార్థి దశ నుండి (1942) వుంటున్నాను. 1947 నుండి న్యాయ వాద వృత్తిలో ఉంటున్నాను. మొదటి నుండి నెల్లూరు పౌర జీవితంలో చురుకుగా

## అనంతరామయ్య అభిప్రాయం

పనిచేస్తున్నాను. షుమారు 8 సంవత్సరాలు హేమా హేమీ ఛేర్మన్ దివంగత శ్రీ ఎ.సి. సుబ్బారెడ్డి గారి హయాంలో మునిసిపల్ కౌన్సిల్‌లో ప్రతిపక్ష నాయకుడిగా వుండినాను. ఈనాటికీ నెల్లూరు పౌర జీవితంతో విడదీయ లేని సత్సంబంధాలు కలిగి యున్నాను. అటువంటి నాకు గాని, నెల్లూరు పట్టణాభివృద్ధికి కృషి చేసిన మాజీ మునిసిపల్ కౌన్సిలర్లకు గాని, ప్రముఖ పౌరులు, ప్రజా సేవకులకు గాని ఆహ్వానాలు లేకుండా మంత్రి గారికి "పౌర సన్మానం" జరపడం బాధ, ఆశ్చర్యం కలుగజేశాయి. ఈ పౌరులకు తెలియని, పౌరులను ఆహ్వానించని ఈ పౌర సన్మానం ఎందుకు జరిపినట్లు?

షుమారు 52 సంవత్సరాల నుండి నాకు నెల్లూరు మునిసి పాలిటీతో సంబంధం వుంది. ఈ యాభై సంవత్సరాలలో నెల్లూరు మునిసిపాలిటీ ఏ ఇద్దరికో పౌర సన్మానం చేసింది. అందులో ఒకరు ఆనాటి గవర్నరు భీమ్‌సేన్ సచ్చార్ గారు.

పౌర సన్మానం అనేది మహా గొప్ప వ్యక్తులను, ఏదో ఒక గొప్ప విశిష్టత సాధించిన మహనీయులను పౌరులు సామాజికంగా వారి సంఘ సేవలను గుర్తించి, తమకు ప్రాతినిధ్యం వహించే మునిసిపల్ కౌన్సిల్, లేదా కార్పొరేషన్ల ద్వారా తీర్మానాలు చేసి కృతజ్ఞతా పూర్వకంగా పౌర సన్మానం జరుపుతారు. అది పౌరులందరి తరపున జరిపే సన్మానం. ఏ వ్యక్తి, గ్రూపు యొక్క స్వార్థ రాజకీయ[illegible] కాదు.

శ్రీ రమేష్ రెడ్డి ఛై[illegible] వున్న కాలంలో ప్రపంచ శాంతికి నిర్విరామ కృషి సల్పి, ప్రపంచంలో పెట్టుబడి దారీ, సోషలిస్టు దేశాల ప్రభుత్వాల నుంచి ఎన్నో స్వర్ణ పతకాలను, సన్మానాలను పొందిన ప్రపంచ శాంతి సంఘం అధ్యక్షుడు శ్రీ రమేష్ చంద్ర; పాలెస్తీనా విముక్తి పోరాట సంఘ నాయకులు, వీర వియత్నాం దేశపు రాయబారి వంటి ప్రముఖులు నెల్లూ[illegible]ట్టానికి రాగా, వీరందరికి కలిపి ఒక పౌర సన్మానం జరుపమని శ్రీ రమేష్ రెడ్డి గారికి విజ్ఞాపన చేసినా వారు అంగీకరించలేదు

శ్రీ రమేష్ రెడ్డి గారి కాలంలో టిడిపి నాయకుడు శ్రీ ఎన్‌టిఆర్‌కు కూడా పౌర సన్మానం జరుపలేదు. ప్రజాదరణ పొంది, మన జిల్లాకు, రాష్ట్రానికి పేరు ప్రతిష్ఠలు తెచ్చిన శ్రీ బెజవాడ గోపాల రెడ్డి గారికి ఈనాటికీ మన స్వంత సింహపురిలో పౌర సన్మానం జరుగలేదు. సర్వోదయ నాయకులు, త్యాగశీలురు మన నెల్లూరుకు పలు మార్లు విచ్చేసి యున్నారు. వారెవ్వరికీ మన మునిసిపల్ ఛేర్మన్లు పౌరసన్మానం చేయలేదు.

ఇది ఒక రకంగా నిజంగా, జైళ్ళకు పోయి, సామ్రాజ్య వాదులను ఎదిరించి పోరాడి, ఆస్థి పాస్థులను పోగొట్టుకొని, తమ తమ రంగాలలో సాటి లేని విశిష్టతను సాధించిన వారిని కించ పరచడమే కదా?

ఇటువంటి యావన్మంది పౌరులకు సంబంధించిన విషయాలు నిర్ణయించే దానికి ముందు పది మంది పుర ప్రముఖులతో సంప్రదించి వారి అభిప్రాయాలు సేకరించి అనుగుణంగా ప్రవర్తించడం నిజమైన ప్రజాస్వామ్యం.

శ్రీ ఆనం వివేకానంద రెడ్డి మీద గాని, మంత్రి శ్రీ తమ్మినేని సీతారాం గారి మీద గాని, నాకు ఏమీ కోప తాపాలు, ఈర్ష్యా - ద్వేషాలు లేవు. నెల్లూరు పౌరులలో ఒకరిగా, మునిసిపల్ కౌన్సిల్ మాజీ ప్రతి పక్ష నాయకుడిగ, సత్సాంప్ర దాయ అభిలాషిగా ఈ లేఖ వ్రాస్తున్నాను. సహృదయంతో స్వీకరించండి.

## నెల్లూరు సంగతులు

4 పేజీ కొరవ

పూర్ణ చంద్రరావు, ఎఎస్‌పి సూర్యనారాయణ కూడా పాల్గొన్నారు.

### వివేకానందరెడ్డి ప్రయత్నాలు ఫలించాయి!

ఆనం వివేకానంద రెడ్డి వి.ఆర్. కాలేజి కరస్పాం డెంటు అయ్యింది మొదలు కాలేజిలో కొత్త కోర్సుల ఏర్పాటుకు ఎడతెగని ప్రయత్నాలు చేస్తూనే వున్నారు. ఆ ప్రయత్నాలు ఇప్పటికి ఫలించాయి. బిఎస్‌సి కంప్యూటరు, ఎం.సి.ఎ., ఎం.బి.ఎ. కోర్సులు ఈ యేడాది నుంచి మొదలౌ తున్నాయి. కిండర్ గార్డన్ స్థాయి నుంచి కంప్యూటర్‌ను పిల్లలకు అందుబాటులో వుంచేలా సాంకేతిక విద్యాశాఖ అనుమతితో కొత్త పథకం అమలు చేయాలని వివేకాకు మరో కోరికుంది. అది కూడా త్వరలో నెరవేరితే; వి.ఆర్.సి. ఒక మినీ యూనివర్శిటీలా తయారవు తుంది.

### మహిళలకు చైతన్య శిబిరం

గ్రామీణ మహిళా కార్మికుల చైతన్య శిబిరం విజయవాడ కార్మిక విద్యా సంస్థ సహకారంతో నెల్లూరు భక్తవత్సల నగర్‌లో జరిగింది. చైతన్య మహిళా మండలి ఆధ్వర్యంలో రెండు రోజుల పాటు జరిగిన శిబిరంలో 80 మంది మహిళలు పాల్గొన్నారు. కార్మిక సంఘాల అభివృద్ధి, సహకార సంఘాల ద్వారా ప్రయోజనాలు, స్వయం ఉపాధి, మహిళల పొదుపు, కుటుంబ సంక్షేమం, శిశు రక్షణ అంశాల పై చర్చ జరిగింది. కేంద్ర కార్మిక సంస్థకు చెందిన ప్రత్యేక అధికారిణి వి. స్వరూప రాణి, టౌన్ మహిళా కాంగ్రెస్ అధ్యక్షురాలు పందిళ్లపల్లి అరుణమ్మ, చైతన్య మహిళా మండలి అధ్యక్షురాలు మన్నెం భవానమ్మ, వికాస్ యూత్ అధ్యక్షుడు శివహరి ప్రసాద్ తదితరులు పాల్గొన్నారు.

### శ్రీనాథ జయంతి

వర్తమాన సమాజం అక్టోబర్ 2తేది టౌన్ హాల్‌లో శ్రీనాథ జయంతి సభను నిర్వహిస్తుంది. డాక్టర్ బెజవాడ గోపాల రెడ్డి అధ్యక్షతన జరిగే సభలో మద్రాసు యూనివర్శిటీ తెలుగు శాఖాధిపతి ప్రొఫెసర్ వి. రామచంద్ర చౌదరి శ్రీనాథుని కవితా వైభవం పై మాట్లాడారు. అనంతరం సభా పోషకులు పి. నరేంద్ర రెడ్డి చేతుల మీదుగా సన్మానం అందు కొంటారని సమాజం అధ్యక్ష, కార్యదర్శులు పి.వి. రమణా రెడ్డి, టి.వి. నరసింహం తెలియ జేస్తున్నారు.

### నెల్లూరు బజారు

| | | |
|---|---|---|
| మొలగొలుకులు | | |
| | 9674 | 5,400/- |
| | 9672 | 5,000/- |
| సున్నాలు | | 3,200/- |

## పంచాంగం

### పండుగలు

1 తేది [illegible] వారం సరస్వతీ పూజ, రాత్రికి దుర్గాష్టమి

2 తేది సోమవారం మహర్నవమి

3 తేది మంగళవారం విజయదశమి

### ముహూర్తములు

4 తేది బుధవారం ఉదయం 9.46 గంటలకు వృశ్చిక లగ్నమున వివాహ ఉపనయన వ్యాపార, అక్షర, గృహారంభములకు

6 తేది శుక్రవారం ఉదయం 9.38 గంటలకు ఉపనయన వివాహ, గృహారంభ వ్యాపార, అక్షరా రంభములకు వృశ్చిక లగ్నమున సుముహూర్తములు వున్నవి.

తే 30శని షష్టి ప.గ. 12.57 వ

### అక్టోబరు తిథులు

| | | | |
|---|---|---|---|
| తే 1 | ఆది | సప్తమి | ఉ.గ. 10.35 వ |
| తే 2 | సోమ | అష్టమి | ఉ.గ. 8.05వ |
| | | తరువాత నవమి | రా.గ. 5.41వ |
| తే 3 | మంగళ | దశమి | రా.గ. 3.28వ |
| తే 4 | బుధ | ఏకాదశి | రా.గ. 1.26వ |
| తే 5 | గురు | ద్వాదశి | రా.గ. 11.39వ |
| తే 6 | శుక్ర | త్రయోదశి | రా.గ. 10.18వ |

స్వయంపాకుల శ్రీనివాసులు



జననం: 12.4.1921 మరణం: 13.10.1994

## శ్రీ గ్రిద్దలూరు వీరభద్రయ్య గారి

ప్రథమ వర్థంతి - 2.10.1995

(తిథి ప్రకారం - మహర్నవమి పండుగరోజు)

మీరు మమ్మల్ని వదలి అపుడే సంవత్సరం అయిందా?

నిరంతరం మీ జ్ఞాపకాలను తలుచుకొంటూ మీరు గడిపిన "కర్మయోగ" జీవితాన్ని ఆదర్శంగా తీసుకొని మీ అడుగు జాడలలో నడిచే

మీ కుమారులు

గ్రిద్దలూరు బాలచంద్రశేఖర్
గ్రిద్దలూరు శశిశేఖర్

గ్రిద్దలూరు వెంకటసోమశేఖర్
గ్రిద్దలూరు శశాంక శేఖర్

సినిమా సినిమా సినిమా సినిమా సినిమా సినిమా సినిమా సినిమా

# ప్రభుదేవా దొంగ పెండ్లి

ప్రభుదేవాకు రమ్యలత అనే ముస్లిమ్ గ్రూప్ డాన్సర్‌తో చాలా కాలంగా పరిచయం ఉంది. ఆ రోజుల్లో ప్రభుదేవా కూడా గుంపులో గోవిందాగా డాన్స్ చేస్తుంటే వారు. ఈ ప్రేమ వ్యవహారం ఇరు వైపుల పెద్దలకు తెలీదు. ప్రభుదేవా ఓ అంతస్తుకు చేరుకున్నాక ఆమెను వివాహ మాడ...న సమయం ఆసన్నమైనదని భావించారు. ఒకరోజు పుటుక్కున తన తండ్రి డాన్స్ మాస్టర్ సుందరంతో ఈ విషయం చెప్పారు. అంతే, పెద్ద తుఫాను చెలరేగింది. "మన మతమేమిటి? వాళ్ల మతమేమిటి? నీకు ఆమె కావాలో, మేము కావాలో తేల్చుకో" అన్నారు. ప్రభుదేవా ఆయన మాటకు ఎదురు చెప్పకుండా బెంగుళూరులో ఏదో ఔట్‌డోర్ షూటింగ్ ఉందని ఇంట్లో చెప్పి, బయలు దేరి బెంగుళూరులో రమ్యలతను రిజిస్టర్ మేరేజ్ చేసుకున్నారు. ఎందుకైనా మంచిదని మద్రాసు కోడంబాకంలో అడ్వాన్సు చెల్లించి, ఒక ఫ్లాట్ అద్దెకు తీసుకున్నారు. ప్రభుదేవా నటిస్తున్న "లవ్ బర్డ్స్" చిత్రం దర్శకుడు పి. వాసు ఆ చిత్రం షూటింగ్ పూర్తయ్యే వరకు ఈ రహస్య వివాహం గురించి ఎవ్వరికీ తెలియ నివ్వొద్దన్నారు. కాని, ప్రభుదేవా తండ్రికి ఎలాగో తెలిసింది. దాంతో గొడవ. ప్రభుదేవాకు ఏమి చేయుతమో ఇంత వరకు తెలీలేదు. ఇంకో వారానికి గాని ఈ వ్యవహారం ఒక కొలిక్కి రాదు.

## ఎన్టీఆర్ ప్రధాని-చంద్రస్వామి జోస్యం!

ఇప్పటికే ప్రపంచ వ్యాప్తంగా వందలాది మంది దేశాధి నేతల భవితవ్యం గూర్చి జోస్యం చెప్పి వారికి చేరువైన వివాదాస్పద తాంత్రికుడు చంద్రస్వామి ముఖ్యమంత్రిగా వున్నప్పుడు ఎన్టీ రామారావును కలసి ఒక వుచిత సలహా యిచ్చారట.



రామారావుకు లక్ష్మి పార్వతికి ఎలాగూ సంతాన యోగం లేక పోవడం వల్ల పార్వతి పుత్రుడు వీరగంధం కోటేశ్వర ప్రసాద్‌ను దత్త స్వీకారం చేయమన్నారట. ఈ పనిచేస్తే ఎన్టీఆర్ ప్రధాన మంత్రి అయ్యే యోగం వుందని జోస్యం చెప్పారట. చంద్ర స్వామి సలహాను పాటించక మునుపే ఎన్టీఆర్ ముఖ్యమంత్రి కుర్చీ వీడి పోవాల్సి వచ్చింది. మరి పాటించి వుంటే ఏం జరిగేదో?

## మదీనా ఇస్మాయిల్ ఆత్మ

వెండి తెరపై హీరోగా వెలిగి పోవాలని నెల్లూరు మదీనా వాచ్ కంపెని అధినేత ఎం.డి. ఇస్మాయిల్ చిరకాల కోరిక; ఇప్పటికే పలు టివి ఫిలిమ్స్ రూపొందించిన ఇస్మాయిల్ తానే నిర్మాతగా 'ఆత్మ' అనే చలన చిత్రాన్ని రూపొందిస్తున్నారు. ...హార్రర్ ధోరణిలో నడిచే ఈ చిత్రానికి నవలా రచయిత శైలకుమార్ కథ, మాటలు సమకూర్చారు. సంగీతం శివాజీ రాజా, దర్శకుడుగా సి.హెచ్. వెంకట్, బదలీ ... ఈ సినిమాల యావలో పడి ఇస్మాయిల్ నెల్లూరు బంగారం వంటి బిజినెస్‌ను పాడు చేసుకో కూడ... ఆ..



ఆత్మ చిత్రం షూటింగ్ ప్రారంభోత్సవంలో హీరో మదీనా వాచ్ కం... ఇస్మాయిల్, దర్శకుడు వెంకట్, నాయిక రేణుక.

## ...ంగోపాల్ వర్మ మకాం మార్పు

తెలుగు చిత్ర నిర్మాణ వ్యయం హిందీ చిత్రాలకు ఏ మాత్రం తీసి పోవడం లేదు. కాని, హిందీ చిత్రాల మార్కెట్ పెద్దది. అంచేత హిందీ చిత్రాల మీదే తన దృష్టి లగ్నం చేయదలిచాడు రాం గోపాల్ వర్మ. ఈయన తాజాగా రూపొందించిన "రంగీలా" చిత్రం విజయం సాధించింది అందువల్ల తన బసను బొంబాయికి తరలించబోతున్నాడు.

## ఒకే చిత్రానికి రెండు ముగింపులు

కె. బాలచందర్ సంస్థ కవితాలయ కె.ఎస్. రవి కుమార్ దర్శకత్వంలో "ముత్తు" (ముత్యం) తమిళ చిత్రం నిర్మిస్తోంది. రజనీ కాంత్ రాజకీయ రంగ ప్రవేశం గురించి ప్రయత్నాలు జరుగు తున్నందున ఆ చిత్రం ముగింపు మామూలు హాస్య శుభంగా ఒకటి, రాజకీయ సంఘర్షణతో మరొకటి రెండు విధాలుగా ముగింపు చిత్రీకరించారు. ఈ చిత్రం విడుదలయ్యే

కొరవ 11 పేజీలో

## ఆశా సౌశా లేని సినిమాలో జయసుధ

భారతీ రాజా రూపొందించే ప్రతి చిత్రంలోనూ ఏదో ప్రత్యేకత ఉంటుంది. ఆయనే తాజా ప్రయోగాత్మక చిత్రం "అంది మందారై"లో పాటలుండవు, డాన్సు లుండవు, ఉద్వేగ భరితమైన సన్నివే...ంటాయి. ... ...న పాత్రధారి. ...అనువదించడం జరుగుతుంది.

### తగిన గుర్తింపు లేకపోతే ఎలా?

1935 ప్రాంతంలో తన హాస్య చిత్రాలతో అమెరికన్లను రంజింప చేసిన హెరాల్డ్ లాయిడ్ మరణించాడు. ఇప్పుడు చలన చిత్ర శతాబ్ది సంవత్సరంలో ఆయన గౌరవార్థం ఏం చేయడమా అని అమెరికన్ ప్రభుత్వం ఆలోచించింది. ఆ నటుని కుటుంబంలోని వారు ఎవరైనా ఉన్నారా అని ఆరాతీస్తే, ఇతని మనుమడు ఏదో కంపెనీలో కార్మికుడుగా పని చేస్తున్నాడని తెలిసింది. వెంటనే అతడ్ని వెతికి పట్టుకుని అతనికి ఒక ఇల్లు ఇవ్వడమే కాకుండా ప్రతి నెలా 500 డాలర్లు ఇవ్వడానికి అమెరికన్ ప్రభుత్వం నిశ్చయించింది. ... మన దేశం పరిస్థితి ఎలా ఉందో చూద్దాం. ... భారత చలన చిత్ర ఫి... ...దు దా... సాహెబ్ ఫాల్కే ... రాజా హరిశ్చంద్ర అనే తొలి సినిమా నిర్మించారు. దాదాపు 120 మూకీ చిత్రాలు తీశారు గాని చివరి దశలో నష్ట పోయాడు. దుర్భర జీవితం గడుపుతూ మరణించాడు. ఆయన గౌరవార్థం 1957లో కేంద్ర ప్రభుత్వ...

### సమయోచిత చి... "ఛీఫ్ మినిస్టర్"

"మన రాష్ట్రంలో రాజకీయ సంఘటనలకు దర్పణం పట్టే అంశాలున్న మక్కళాచ్చి తమిళ చిత్రాన్ని తెలుగులో డబ్ చేస్తున్నాం. ఒక దొంగ అనుకోని పరిస్థితుల్లో ఛీఫ్ మినిస్టర్ అవుతాడు. ఇక డైరక్ట్‌గా దోపిడీ చేయ నారంభిస్తాడు. అతను పరివర్తన చెందే తరుణంలో అతని భార్య ప్రజా దోపిడీకి పూను కుంటుంది. చివరికి లొంగి పోవడం కథాంశం" అన్నారు ఈ చిత్రాన్ని సమర్పించే సి.వి. రాజా.

## పోలీసు విలువ పెంచిన.... ఖైదీ ఇన్స్‌పెక్టర్

గిద్దలూరు గోపాలరావు

పోలీసు శాఖ అవినీతిని, అత్యాచారాలను ఇంతవరకు కొన్ని సినిమాలు ఉతికి ఎండ గట్టాయి. ఆ శాఖ నిరంకుశ, నిర్లక్ష్య చరిత్రను నిరసించాయి.



ఇప్పుడు బి. గోపాల్ దర్శకత్వంలో రూపు దిద్దుకున్న "ఖైదీ ఇన్స్‌పెక్టర్" సినిమాలో పోలీస్ విలువలు పెంచ బడ్డాయి. తాకట్టుకు గురవుతున్న పోలీస్ లోపలి నిజాయితీ అలవరచబడింది. అవినీతికి అమ్ముడు పోతున్న ఖాకీ దుస్తులకు నీతి నేర్పబడింది. భక్షణే ధ్యేయంగా విజృంభించే ... విచక్షణ, రక్షణ గుర్తు చేయబడ్డాయి. వెరసి టోపీకి, ఖాకీకి, లాఠీకి మానవతా లక్షణాలు రంగరించ బడ్డాయి. కొత్త అవగాహనకు, నూతన మార్పుకు దారులు చూపబడ్డాయి.

పోలీసు శాఖకు సంబం ధించిన కొన్ని ముఖ్య విషయాలను ఈ సినిమా చర్చించింది. న్యాయ దేవతకు న్యాయ స్థానాలు చెవులైతే, పోలీసు వ్యవస్థ కళ్ళు కావాలని సూచించింది. కోర్టులో పోలీసు సాక్ష్యం చెల్లదనే చట్టాన్ని మార్చాలన్న అభిప్రాయం వెలి బుచ్చింది. ఈ విషయాలు పోలీసు వ్యవస్థ స్థానాన్ని బలపరిచాయి. దర్శకుడు ఈ వాదనలను ...గా ...చాడు. అంత కాదు ఒక రౌడీ చేత న్యాయ వాదులను, చట్టాలను, ... వ్యవస్థలోని లోపాలను నేటికొచ్చినట్టు తిట్టించాడు. వెంటనే ఆ రౌడీ నోటి పొగరు అణిచేట్టు చేశాడు.

కొరవ 11 పేజీలో

## కాకినాడ మొదట అడిషినల్ డి.ము.కోర్టులో

O.S. 629/94

Between:

బ్యాంక్ ఆఫ్ ఇండియా, మెయిన్ బ్రాంచి, కాకినాడ, తూ.గో. జిల్లా -వాది

And

దేవరశెట్టి గురుస్వామి, S/o. మాలయ్య, తెల్లపాడు గ్రామం, కలిగిరి, నెల్లూరు జిల్లా -ప్రతివాది

పై నెంబరు దావాలో, మీకు నోటీసు నిమిత్తం 30.10.95 తేది వాయిదా అయి ఉన్నది. కావున ఏ విధమైన ఆక్షేపణలు ఉన్నా, మీరు స్వయముగా గాని, అడ్వకేటు ద్వారా గాని పై కోర్టులో ఉదయం 10.30 గంటలకు హాజరు కావలెను. లేని ఎడల మీ పరోక్షమున తీర్మానించ బడునని ఇందు మూలముగా తెలియ చేయడమైనది.

కాకినాడ 25.9.95 మర్ల నరసింహారావు అడ్వకేట్

## ప్రకటన

మా కక్షిదారులున్ను బోగోలు మండలం చెన్నా రాయుని పాళెం గ్రామ కాపురస్తులైన (1) బుర్లా ఆదిశేషారెడ్డి కుమారుడు హజరత్త రెడ్డి, బుర్లా హజరత్త రెడ్డి కుమారులు (2) శరశ్చంద్ర ప్రసాద రెడ్డి, (3) సాయి చంద్ర ప్రసాద రెడ్డి అనువారలు ప్రస్తుతము నెల్లూరు మిలటరీ కాలనీలో కాపురం వుందు జలదంకి ఆదిశేషా రెడ్డి కుమారుడు వెంకారెడ్డి గారి పేరటికి 22.12.92 తేదిన ఇచ్చిన రిజిస్టర్డ్ జనరల్ పవర్ ఆఫ్ అటార్నీ రద్దు చేయుచూ నోటీసు ఇచ్చినారు. సదరు వెంకారెడ్డి పేరటికి ఇచ్చిన పవర్ ఆఫ్ అటార్నీని రద్దు అయిన విషయమును యావన్మందికి ఇందు మూలముగా తెలియ జేయడ మైనది.

వై. జానకిరామయ్య
అడ్వకేటు, కావలి

## గూడూరు డి.ము. కోర్టులో

O.S. No. 16 of 1995

Indian Overseas Bank, Gudur represented by its Branch Manager -వాది

Vs

1. M/s. Sensitive Glass Industries, Tagore Street, Gudur rep. byt its proprietor 2. పరపల రమణమ్మ, 3. పముజాల శేషమ్మ, 4. పన్నెం రవి కుమార్ -ప్రతివాదు

### ప్రతివాదులకు దావా నోటీసు

యీ నెంబరు వారి మీ పై యీ దావా దాఖలు చేసి యున్నందున యిందుకు మీకేమైనా ఆక్షేపణలున్న యెడల 20.10.95 తేది పగలు 10.30 గంటలకు పై కోర్టు వారి ఎదుట హాజరై తెలుపు కొనవచ్చును. లేని యెడల యీ విషయము మీ పరోక్షములో తీర్మానించ బడును.

పి. ప్రభాకరశాస్త్రి
వాది అడ్వకేటు

## వెండి తెర పై వెల్లువెత్తిన శృంగారం- సెన్సార్ పై రామ్‌గోపాల్ వర్మ ప్రతీకారం!

# రంగీలా

### చిత్రసమీక్ష
అల్లూరు రహీం

దర్శకుడు రామ్ గోపాల్ వర్మకు తాను తీసే చిత్రాలలోని సన్నివేశాలను మోతాదు మించి చిత్రీకరించడం రివాజు. శివ చిత్రంలో మితి మీరిన హింసకు టెక్నిక్ మేళవించి చూపడం వల్ల ప్రేక్షకులు ఆయన్ను క్రేజీ దర్శకు డన్నారు. గోవింద... గోవిందా తెలుగు చిత్రం సెన్సార్ సభ్యుల నిరంకుశ వైఖరి వల్ల అట్టర్ ఫ్లాప్ అయ్యిందని ఆవేదన చెందిన వర్మ, ప్రస్తుతం బోర్డులో వున్న సెన్సార్ సభ్యులందరూ మారి పోయే వరకు తెలుగు చిత్రాలు తీయనని భీష్మ ప్రతిజ్ఞ చేశాడు. అందువల్లే కొంత కాలంగా హిందీ ఫీల్డ్ పై దృష్టి నిలిపి, యువతలో విపరీతమైన కామ ప్రకంపనలు రేకెత్తించే అంగాంగ ప్రదర్శనలు వెండి తెర్పై వెల్లువెత్తేలా 'రంగీలా' చిత్రాన్ని నిర్మించి, దర్శకత్వం వహించి మళ్లీ సంచలనం సృష్టించాడు. సన్నగా, ఎముకల గూడులా కనిపించే హీరోయిన్ ఊర్మిళను అద్భుత శృంగార కావ్య నాయికగా వెండి తెర పై ఆవిష్కరింప జేశాడు. సముద్ర తీరంలో హీరోయిన్ నాట్య మభ్యసిస్తున్నట్లు చూపించిన సన్నివేశాన్ని చవక బారు మలయాళ సినిమాతో పోల్చవచ్చు. మరొక పాటలో తాపం తీరని ప్రియుడు ప్రియురాల్ని పొందాలన్న తపనతో తహతహ లాడే సన్నివేశాలు చూసిన యువతకు పెడత్రోవ ఆలోచనలు కల్గి తీరుతాయి. శృంగార సాహిత్యం కుమ్మరించిన మెహబూబ్ పాటలు; రెహమాన్ వెస్టన్ సంగీతం, వై.జి. రావు కెమెరా పనితనం చూపి ప్రేక్షకులను రసరమింప చేసారు.

సినిమాల్లో సైడ్ డ్యాన్సర్ అయిన మిలి (ఊర్మిళ) అంద చందాలను సముద్ర తీరాన కనులారా గాంచిన సినిమా హీరో రాజ్ కమల్ (జాకీ ష్రాఫ్) ఆమెకు హీరోయిన్ ఛాన్స్ ఇప్పిస్తాడు. మధ్య తరగతి కుటుంబానికి చెందిన మిలి ఈ అవకాశానికి వుబ్బి తబ్బిబ్బై పోతుంది. తనను హృదయ పూర్వకంగా ప్రేమించే జులాయి మున్నా (అమీర్ ఖాన్) కు దూర మవుతుంది. తన ప్రియురాలిని ప్రమాదంలో కోల్పోయిన హీరో రాజ్ కమల్ మిలి పై ఆశలు పెంచు కొంటాడు. మిలి అభివృద్ధిని కాంక్షించి మున్నా ఆమె నుండి దూరంగా వెళ్లాలను కుంటాడు. కాని మిలి - మున్నాల ప్రేమను అర్థం చేసుకొన్న రాజ్ కమల్ వారిని ఒకటి చేస్తాడు.

ఈ ముగ్గురి మధ్య సాగే ఈ ప్రేమ కథలో ఏ ఒక్కరూ తమ ప్రేమను ముందుగా వెల్లడించ లేక పోవడంతోనే సమస్యలు మొదలవు తాయి. రాజ్ కమల్ తన ప్రియురాలి యాక్సిడెంట్ గూర్చి మాటల్లో చెబు తున్నప్పుడు సన్నివేశాలు లేకుండా కేవలం సౌండ్ ఎఫెక్ట్లో చూపించిన తీరు బాగుంది. తనకు మున్నా చివరి లేఖ వ్రాసినప్పుడు, రాజ్ కమల్ వద్ద మిలి వెలిబుచ్చే అమాయకపు ప్రేమ మనసున్న వారిని మెలి తిప్పుతుంది. ఈ చిత్రంలో రామ్ గోపాల్ వర్మ బొంబాయిలోని ఫుట్‌పాత్‌ల జనం వాడే భాషను పాత్రల ద్వారా పలికింప జేశారు. యాయిరే, క్యానరే, తనహో చరణాలతో సాగే పాటల్లో గాయకుల గాత్రాల నుండికొంగ్రొత్త దనం జాలు వారింది. చిత్రంలో ఒక సన్నివేశంలో దర్శకుడు ఎస్వీ కృష్ణారెడ్డి రూపొందించిన మాయలోడు హిట్ ట్యూనింగ్‌ను సంగీత దర్శకుడు రెహమాన్ కాపీ చేసాడు. చాలా చోట్ల బొంబాయి చిత్రానికి ఉపయోగించిన మెలొడి రిథమ్ కూడా మళ్లీ వాడాడు. మితి మీరిన శృంగారాన్ని తీసి పక్కన బెడితే ప్రకృతిలోని అందమైన కొండలు, కోనలు, సెలయేళ్లు పచ్చిక బయళ్లు చివరికి ఎడారుల్లో కూడా తన చిత్ర సన్నివేశాలు [illegible]ంచడం ద్వారా రామ్ గోపాల్ వర్మ పడిన శ్రమకు తగ్గ ఫలితం ప్రేక్షకులకు కన్పడింది. కాని విపరీతమైన సెక్స్యువల్ ఎక్స్‌పోజింగ్‌తో కూడిన ఈ సినిమాకు సెన్సార్ వారు కట్టింగ్స్ లేకుండా సర్టిఫికెట్ ఎలా ఇచ్చారన్న ప్రశ్న సామాన్యులను వేధించక మానదు. ఆ రూపంలో సెన్సార్ పై ప్రతీకారం తీర్చు కున్నట్లున్నాడు రామ్ గోపాల్ వర్మ.

### 50 ఏళ్ళ క్రితం
3 పేజీ కొరవ

శాస్త్రుల వారి శాకుంతలాన్ని మన కామరాజు గడ్డ ప్రభృతులు 6 తేది ప్రదర్శిస్తారట. అనాఘ్రాతం పుష్పం మనసు కుమారియట. యింకా ఆ చచ్చిన దొరస్వామయ్యం గారి సెట్టునే తలచుకొని లొట్టలేస్తె ఏం లాభం? రండి చవి చూద్దాం. షడ్రసో పేతాన్ని రుచి చూచిన నాలుక అల్పప్పచ్చడిని గూడా అభిలషిస్తుందిగా.

#### విడవలూరు కొట్లాట వివరాలు

ఇద్దరు మరణించారు, 89 మంది అరెస్టు

నెల్లూరుకు 12 మైళ్ల దూరంలో వుండే విడవలూరు గ్రామంలో సీల పారుదల వద్ద 21 తేది ఉదయం 10 గంటలకు పెద్ద కొట్లాట జరిగింది.

#### పోలీసు

ఈ కేసు విచారణ కోవూరు పోలీసు సబ్ ఇన్స్‌పెక్టర్ నరసింహా రావు, ప్రత్యేకంగా ఘట్టి వాడని ఈ కార్యానికి నియోగింప బడిన సబ్ యిన్స్‌పెక్టరు అమీనుల్లా బేగ్, పొడుగ్గా లొంగని వాడు సర్కిల్ యిన్స్‌పెక్టర్ ఆనం రంగారెడ్డి గారలు చేస్తున్నారు. పోలీసు సూపరెంటు గూడజ స్వయంగా పర్యవేక్షణ చేస్తున్నాడు. నిష్పాక్షికమైన ఘట్టి పో[illegible] విచారణ జరుగు తున్నదన్నమాట.

#### ఇందుకూరుపేట

గుడ్డల కరువు తీరేదెప్పుడో? మేము ఒంటి నిండా బట్ట కప్పుకొని తిరిగే సుదిన మెప్పుడో? అంగట్లో అన్నీ వున్నా అల్లుని నోట... ఓరి భగవంతుడా! ఈ గుడ్డలు కరువుకు తాళలేకున్నామురా, అని ఆక్రందన.




## జనవాణి
3 పేజీ కొరవ

విషయం ఏమి సమాధానం చెబుతారో వేచి చూడాలన్నారు. ఈ విషయంలో నిజా నిజాలను నిగ్గు తేల్చేందుకు బహిరంగ విచారణకు పార్టీ సిద్ధంగా వుంది.

నెల్లూరు పి.నాగేశ్వరరావు
సిపిఎం కోటమిట్ట శాఖ కార్యదర్శి

### స్పీడు బ్రేకర్లు!

టౌన్‌లో రోజు రోజుకు జనాభా పెరగడంతో పాటు వాహనాలు జోరు కూడా జాస్తిగా వుంది. ట్రాఫిక్ పోలీసులు ట్రంకు రోడ్డు మీద మాత్రం ఎక్కువ శ్రద్ధ చూపించి సరి పెట్టు కొంటున్నారు. కాని ఈ క్రింది ప్రాంతాల పై కూడా దృష్టి కేంద్రీకరిస్తే ప్రమాదాలు తగ్గుతాయి. ఆర్టీసీ బస్టాండ్ వద్ద లోనికి - వెలుపలికి వచ్చే మార్గాల వద్ద రమేష్ రెడ్డి నగర్, సర్వోదయ కాలేజి ఆగ్నేయ మూలన స్పీడ్ బ్రేకర్లు ఏర్పాటు చేయాలి. వి.ఆర్. కాలేజి, 4 టౌన్ పోలీస్ స్టేషన్‌కు ఉత్తర, దక్షిణం నాలుగు రోడ్ల కూడలి, ముత్తుకూరు అండర్ బ్రిడ్జి, ఫత్తేఖాన్ పేట సెంటర్, సుబ్బారెడ్డి పెట్రోల్ బంక్, అంబుజా షెడ్‌ల వద్ద మరికొన్ని స్పీడ్ బ్రేకర్లు వేయాలి. ట్రాఫిక్ సిఐ, అడ్వైజరీ కమిటీ ఈ విషయమై శ్రద్ధ వహించాలని మనవి.

కలిచేడు -ఎన్.మహబూబ్‌బాషా

### నేత్రదానం చేయండి

గ్రుడ్డి వారికి దృష్టి ప్రసాదించడం కన్నా ఈ అవనిలో మరేదీ కాదు మిన్న. భారత దేశంలో రెండు కోట్ల మంది అంధు లున్నట్లు ఒక అంచనా. ఈ సోదరులకు శాశ్వతంగా చూపును ప్రసాదించేది మరణా నంతర నేత్ర దానం. దీన్ని మించిన దేశ సేవ, సంఘ సేవ మరొకటి లేదు. ఇతరులకు చూపు నివ్వడం వల్ల కలిగే ఆనందం, ఆత్మ తృప్తి, అమరత్వం వెలకట్ట లేనిది. అన్ని దేశాలలో వున్న అంధులకు నేత్రాలు ఎక్కువగా దానం చేసి శాశ్వత దృష్టిని ప్రసాదిస్తున్న శ్రీలంక - చిన్న దేశమైనా ప్రపంచానికే ఆదర్శమైన మార్గదర్శక దేశం.

గూడూరు -పి.వి.ప్రభాకరరావు

### రాజశేఖరంకు అభినందనలు!

ఇటీవల ఢిల్లీలో జరిగిన ఆగమ శాస్త్ర మహా సభలో నెల్లూరీయుడు వైదికరత్న మాచవోలు రాజశేఖరం గారికి ప్రధాని పివి నరసింహా రావు ద్వారా వైదిక విద్యాలంకార బిరుదు ప్రదానం చేయడం ఆనందకరం. అటువంటి వారిని గుర్తించి బిరుదు ప్రదానం చేయడం నెల్లూరీయు లందరికి జరిగిన సత్కారంగా భావించాలి.

నెల్లూరు -ఎస్.వి.ఎస్.కోటేశ్వరరావు

## మహాకవులు
4 పేజీ కొరవ

నారాయణ తన భార్య మరణా నంతరం రాసిన ఎలిజీ - జాషువా రాసిన శ్మశానం కూడా ఎలిజియే. ఇది జన బాహుళ్యాన్ని కూడా బాగా ఆకట్టు కొంది. తిలక్ - నెహ్రూ మరణించి నపుడు "చరిత్ర మిట్ట మధ్యాహ్నంలో చలివేందర కనిపించదేం" అంటూ ఒక మంచి ఎలిజీ రాశాడు. ఇవన్నీ కూడా పరిమాణంలో పెద్దవి.

కవిగా కాళోజీ నారాయణ రావు జరమెంగిన బ్రాహ్మణుడు. కవులలో ఆయనదొక ప్రత్యేక తరహా. కవిత్వంలో ఆయన పొయ్యే పోకడలు వేరు. జయ ప్రకాష్ నారాయణ చని పోయినపుడు కాళోజీ రాసిన ఎలిజీ చదవండి.

"చావు నీది; పుటక నీది; బతుకంతా దేశానిది"- ఇంతే - మూడే మూడు మాటలు - ఒకదాని కింద ఒకటిగా రాసినా, మూడే మూడు పంక్తులు. ఈ మూడు పంక్తుల నడుమ గంభీరమైన భావ చాలనం; తేలిక మాటలలో మేలిమి భావాన్ని పలికించటం గొప్పకళ.

జయప్రకాష్ - నీకు సొంతం అంటూ ఏమీ లేదు; ఒకవేళ ఉంటే - నీ చావు నీ సొంతం - నీ పుట్టుక నీ సొంతం. ఈ రెంటి నడుమ గల నీ బతుకంతా ప్రజలకు అంకితం.

అందరిదీ చావు కాదు - చావు అంటే నీదే చావు - నీ చావు చరితార్థం. పుట్టుక అంటే నీదే పుట్టుక; నీవు, నిన్ను కన్నవాళ్లు ధన్యులు. ఇంకొక శిల్ప చమత్కారార్థం కూడా ఉంది. ముందు జన్మ; తర్వాత చావు. ఇది వ్యత్యస్తమైంది. వెనకది ముందుకు వచ్చింది; ప్రథమ ద్వితీయ మైంది. ఎన్నడూ ఎక్కని రెడ్డి గుర్రమెక్కితే ఎనకా ముందైంది" అన్న సామెతకు ఇది నిదర్శనం కాదు. కవి - అద్వితీయ ప్రతిభా ప్రదర్శనం. శ్రీశ్రీ అన్నట్లు "మహాకవుల మాటల వెంట అర్థం పరుగెడుతూ ఉంటుంది".

చావు పుటకలు ప్రాణి ధర్మాలు; 'చావు' అంటే అందరికీ భయమే. మనిషిని మాత్రమే తీసుకొని పోతుంది. అతడి మంచి చెడ్డలను స్మృతిచిహ్నాలుగా, లోకంలో విడిచి పోతుంది. మనిషి చరితార్థు డయ్యేది చావు వల్లే! అందుకనే కవి పద్యం ఎత్తుగడలోనే గొప్ప ఎత్తువేశారు. ఇంత చిన్న పద్యంలో ఎన్నెన్ని సొయగాలో!

# ఎన్టీఆర్ ఇల్లు కళకళ- కాంగ్రెస్ నుంచి వలస?

మాజీ ముఖ్యమంత్రి శ్రీ ఎన్టీ రామారావు శిబిరం రోజు రోజుకూ కళ కళ లాడుతోంది. అధికారం కోల్పోయి నెల రోజుల దాటాక ఎన్టీఆర్‌లో నూతన ఉత్సాహం కనిపిస్తోంది. పదవి కోల్పోయిన మొదటి పదిహేను రోజులు ఎన్టీఆర్ నివాసం బిక్కు బిక్కుమన్నా, చంద్రబాబు నగరంలో జరిపిన బల ప్రదర్శన తర్వాత ఎన్టీఆర్‌ను చూడవచ్చే సందర్శకుల సంఖ్య బాగా పెరిగింది. ముఖ్యంగా గ్రామీణ ప్రాంతాల నుంచి పెద్ద సంఖ్యలో జనం వచ్చి ఎన్టీఆర్‌కు మద్దతు ప్రకటిస్తున్నారు. ఎమ్మెల్యేలు ఎంపీలు తనవెంట లేక పోయినా జనం మాత్రం తనకు అండగా వున్నారన్న నమ్మకం బలపడటంతో ఎన్టీఆర్ కూడా చురుకైన పాత్ర నిర్వహించాలని నిర్ణయించారు. వచ్చే పార్లమెంటు ఎన్నికల నాటికి పార్టీకి కొత్త జవం - జీవం కల్పించేందుకు అన్ని రకాల చర్యలూ తీసుకుంటున్నారు. వెన్నుపోటు పొడిచిన చంద్రబాబు పై ఒక వైపు న్యాయ పోరాటం చేస్తూనే ప్రజల్లోకి వెళ్లి మద్దతు సమీ... లోక్ సభ ఎన్నికల్లో బలీయమైన శక్తిగా రూపొందాలన్నది ఎన్టీఆర్ ధ్యేయం. ఇందుకు అనుగుణంగానే లోక్‌సభ ఎన్నికల్లో పోటీ చేసే అభ్యర్థుల ఎంపికలో అతి జాగ్రత్త వహిస్తున్నారు. ముఖ్యంగా ఇతర పార్టీలో వున్న భావ సారూప్యత కలిగిన వ్యక్తులు, బాబు వ్యతిరేకుల్ని కూడగట్టి లోక్‌సభ ఎన్నికల్లో గట్టి పట్టు సంపాదించే వ్యూహ రచనలో ఎన్టీఆర్ తలమునకలై వున్నారు. బాబు పొడగిట్టని వారంతా క్రమంగా ఎన్టీఆర్ వైపుకు మొగ్గు చూపుతున్నారు.

## కాంగ్రెస్ నుంచి వలస?

ఎన్టీఆర్ శిబిరంలోకి పెద్ద సంఖ్యలో కాంగ్రెస్ వాదులు వలస వచ్చే అవకాశాలు కన్పిస్తున్నాయి. ముఖ్యంగా కాంగ్రెస్ మాజీలు పెద్ద సంఖ్యలో ఎన్టీఆర్‌ను కలిసి రాజకీయ చర్చలు సాగిస్తుండడంతో ఈ అనుమానం బలపడుతున్నది. కాంగ్రెస్ మాజీ మంత్రులు డాక్టర్ మైసూరా రెడ్డి, మాదాల జానకి రామ్, సమర సింహారెడ్డి, కేంద్ర మాజీ మంత్రి కమాలుద్దీన్ అహమ్మద్, చనుమోలు వెంకట్రావు, కుందూరు జానారెడ్డి, ముద్రగడ పద్మనాభం, కె.ఇ. కృష్ణమూర్తి ప్రభృతులు ఇటీవల ఎన్టీఆర్‌ను తరచూ కలుస్తున్నారు. మైసూరా రెడ్డికి కడపలో వై.ఎస్. పోరు వుంది. సమీప భవిష్యత్తులో మైసూరాకు కాంగ్రెస్ పార్టీలో తగు స్థానం లభించే అవకాశం లేనందున ఎన్టీఆర్ వర్గంలో చేరి కడప ఎంపీగా పోటీ చేస్తాడన్న ప్రచారం జోరుగా వుంది. అలాగే జానారెడ్డి మిర్యాలగూడెం లోక్‌సభ స్థానానికి, కె.ఇ. కృష్ణమూర్తి కర్నూల్ లోక్‌సభ స్థానానికి పోటీ చేసే అవకాశాలున్నాయంటున్నారు. కృష్ణా జిల్లాకు చెందిన మాజీ మంత్రి చనుమోలు వెంకట్రావు ఎన్టీఆర్ దేశం తరపున విజయవాడ స్థానానికి పోటీ చేసే అవకాశా లున్నాయి. ముద్రగడ పద్మనాభం విషయంలో మాత్రం ఎన్టీఆర్ వెనుకా ముందూ ఆలోచిస్తున్నారట. ముద్రగడ కుల ముద్ర వేయించుకొని అటు కాపుల్లో ఒక వర్గానికి, ఇటు కాపేతరులకు దూరం అయ్యారు. ఎన్టీఆర్ వర్గంలో మిగిలిన రాజ్యసభ సభ్యుడు అల్లాడి రాజ్ కుమార్‌కు ముద్రగడ సన్నిహితుడు కావటం వల్ల ఆయనకు ఎన్టీఆర్ తీర్థం దొరకక పోవచ్చని అంటున్నారు. సమరసింహా రెడ్డి కాంగ్రెస్ హార్డ్‌కోర్ కయినప్పటికీ గద్వాల్ నియోజక వర్గంలో ఆయన సోదరుడు భరత సింహారెడ్డి చేతిలో ఓడిపోయాడు. భరత సింహారెడ్డి ప్రస్తుతం బాబు వర్గంలో వుండడంతో తాను ఎన్టీఆర్ అండదండలతో జిల్లాలో పట్టు సంపాదించాలని అనుకుంటున్నాడు. మంత్రి పదవి దక్కని కమాలుద్దీన్ మాత్రం కేవలం మర్యాద పూర్వకంగానే ఎన్టీఆర్‌ను కలుస్తుంటున్నారు.

### బెదిరింపు కాదు - బెదరంపు

కాంగ్రెస్ నాయకులు పెద్ద సంఖ్యలో ఎన్టీఆర్‌ను కలవటంలో ఫిరాయింపు కంటే కాంగ్రెస్ అధిష్టానాన్ని బెదరించే ఉద్దేశమే ప్రధానమని పిసిసికి చెందిన ప్రముఖ డొకరు వ్యాఖ్యానించారు. కాంగ్రెస్‌లో ఏ పదవులూ లేని వారంతా ఎన్టీఆర్ పేరు చెప్పి ... పదవులు తెచ్చి పెట్టు... కాంగ్రెస్‌ను బ్లాక్ మెయిల్ ... మినహా మరో ఆలోచన ఆ నాయకులకు లేదని ఆయన చెప్పారు.

### వాస్తు మార్పులతో మామా అల్లుళ్ల కుస్తీ!

తాను కోల్పోయిన అధికారాన్ని తిరిగి సంపాదించు కొనేందుకు ఎన్టీ రామారావు, అలాగే సంపాదించుకున్న అధికారాన్ని పదిలంగా వుంచేందుకు చంద్ర ... సుబ్రహ్మణ్య నాయుడు ప్రస్తుతం జ్యోతిష్యం, వాస్తు శాస్త్రాలతో కుస్తీ పడుతున్నారు. నగరంలోని బంజారా హిల్స్ రోడ్ నంబర్ 13 లో వున్న ఎన్టీఆర్ నివాసానికి వాస్తు దోషం వుందని ఆయన ఆస్థాన జ్యోతిష్యులు చెప్పడంతో ఇంటి ముందున్న గోడను కూల్చి విశాలమైన పచ్చిక మైదానం ఏర్పాటు చేస్తున్నారు. అలాగే ఇంటి ముంగిట చిన్న చిన్న మార్పులు, చేర్పులు కూడా జరుగు తున్నాయి. కాగా వాస్తు విషయంలో చంద్రబాబు కూడా మామకు తగ్గ అల్లుడేనని నిరూపించు కుంటున్నాడు. జూబ్లీ హిల్స్ రోడ్ నెం. 65 లో వున్న విశాలమైన భవంతికి మరమ్మత్తులు చకచకా జరుగు తున్నాయి. ఇంట్లో వున్న ఒక గోడను కూల్చి అక్కడ ఖాళీగా వుంచు తున్నారు. నగరంలోని హైదర్ గూడలో ప్రారంభించిన పార్టీ కార్యాలయ భవనానికి గూడా బాబు వాస్తు ట్రీట్‌మెంట్ ఇస్తున్నాడు. అలాగే ఆర్థిక మంత్రిగా వున్నప్పటి సచివాలయ కార్యాలయాన్నే ముఖ్య మంత్రి కార్యాలయంగా వుంచు కోవాలని బాబు భావిస్తున్నాడు. ఈ కార్యాలయంలో పాదం మోపిన వేళా విశేషంతోనే తాను ముఖ్య మంత్రి నయ్యానన్న అభిప్రాయాన్ని బాబు అక్కడక్కడా వ్యక్తం చేస్తున్నాడట. కాగా సచివాలయ ప్రవేశ ద్వారాన్ని 'బుద్ధ పూర్ణిమ' వైపుకు మార్చాలని ఎన్టీఆర్ నిర్ణయించి సంబంధిత నిర్మాణ పనుల్ని యుద్ధ ప్రాతిపదికన చేపట్టారు. అయితే ప్రవేశ ద్వారం నిర్మాణంలో వుండగానే ఎన్టీఆర్ కుర్చీని చంద్రబాబు లాగేసుకున్నారు. సచివాలయ నూతన ప్రవేశ ద్వారం ప్రతిపాదన వాస్తు రీత్యా మంచిది కాక పోవటం వల్లనే ఎన్టీఆర్ తన పదవిని కోల్పో వాల్సి వచ్చిందన్న అభిప్రాయాన్ని కొందరు వాస్తు నిపుణులు వ్యక్తం చేయటంతో దీనికి సంబంధించిన నిర్మాణ పనుల్ని అర్థాంతరంగా నిలిపి వేయాలని బాబు ఆర్డర్ వేశాడు. మామా అల్లుళ్ల వాస్తు ఏర్పాట్లలో చివరికి శాస్త్రి జరుగు తుందో తెలుగు దేశం తెర పై చూడాల్సిందే.

కాగా మంత్రి పదవులు ఆశిస్తున్న పలువురు ఎమ్మెల్యేలు కూడా వాస్తు రీత్యా తమ భవిష్యత్తు ముడి పడి వుందని భావిస్తున్నారు. ప్రస్తుతం తాముంటున్న ఎమ్మెల్యే క్వార్టర్స్‌కు వాస్తు రీత్యా మార్పులు చేర్పులు చేయిస్తున్నారు. ముఖ్యమంత్రి చంద్రబాబు దగ్గర పి.ఆర్.ఓ.గా చేరిన డాక్టర్ విజయ కుమార్ కూడా ఎర్రమంజిల్ కాలనీలో తనకు కేటాయించిన క్వార్టర్‌కు వాస్తు రీత్యా మార్పులు చేర్పులు చేయించు కున్నారు.

...మా ఇంట్లో వినాయకుడు పాలు ఎందుకు త్రాగ లేదు??? ఇట్సైలంగాన్నది ఎవరిదో కుట్రే; ఈ విషయాన్ని నేను నా ప్రజల ముందుంచు తాను! జనం లోకి వెళ్తుతా!!

మనకంటూ జనం లేరంటే వెళ్ళాయన వినకు - కొట్టుకుంటారు

పాలు త్రాగు తున్న విగ్రహాలు వార్త

## చిత్రసమీక్ష

ఖైదీ ఇన్స్‌పెక్టర్

పోసాని కృష్ణ మురళి తన కథను పోలీసు శాఖ ప్రక్షాళన కోసమే వ్రాశారు. నీతి నిజాయితీలతో విధి నిర్వహణను నిర్వర్తిస్తూ సంఘ విద్రోహ శక్తులను ధైర్యంగా ఎదిరించే సీతా రామరాజు అనే సబ్ ఇన్స్‌పెక్టర్ను (సుమన్) సృష్టించారు. ఈ ఇన్స్‌పెక్టర్ కరుకు దనం చురుకు దనం నిరూపించ డానికి శ్రీనివాస యాదవ్ (రామిరెడ్డి) అనే దుష్ట శక్తిని కల్పించారు. అతను రౌడీ గిరి నుంచి రాజకీయ రంగంలోకి దూరేట్టు చేశారు. అతనికి కొందరు రౌడీలను అండగా నిలిపారు. ఇన్స్‌పెక్టర్ నీతి, నిజాయితీ శ్రీనివాస యాదవ్ అరాచక ధోరణితో పోరాటం జరిపేట్టు చూశారు. శ్రీనివాస యాదవ్ ముఠాలోని ఒక రౌడీని ఇన్స్‌పెక్టర్ అరెస్ట్ చేస్తాడు. శ్రీనివాస యాదవ్ ఈ రౌడీని విడిపించక పోగా అతనెవరో నాకు తెలియదంటాడు. వీరిద్దరి మధ్యా వైరం పెరుగు తుంది. ఎలెక్షన్లలో ఒకే సీటుకు వీరిద్దరూ పోటీ చేస్తారు. ఒకరి నొకరు తిట్టు కోవడంలోని అసభ్యత తారాస్థాయి నందు కోవటంతో ఆ అవకాశాన్ని ఉపయోగించుకొని సబ్ ఇన్స్‌పెక్టర్ శ్రీనివాస యాదవ్‌ను, ఆ రౌడీని అరెస్ట్ చేస్తాడు. ఇది ఇలా వుండగా పోలీస్ శాఖలోని పెద్ద అధికారి (నర్రా వెంకటేశ్వర రావు) తన భార్య రౌడీల చేతుల్లో దారుణంగా మరణించటంతో ఆ రౌడీల నందర్ని చంపేసి జైలుకు వెళ్తాడు. ఆ విధంగా "ఖైదీ ఇన్స్‌పెక్టర్" అవుతాడు.

ఈనాటి సినిమాల్లో హీరోకు ఇద్దరు హీరోయిన్లు వుండటం ఆనవాయితీ అయింది కాబట్టి ఈ సినిమాలోను సబ్ ఇన్స్‌పెక్టర్ సీతారామ రాజుకు (సుమన్) మహేశ్వరి, రంభలను జోడించారు. మహేశ్వరి జర్నలిస్టుగా సబ్ ఇన్స్‌పెక్టర్ చురుకు దనాన్ని ప్రత్యక్ష ముఖంగా వెలుగులోకి తీసు కొస్తుంటుంది. ఇక రంభ జూనియర్ పోలీస్ అధికారిణిగా సబ్ ఇన్స్‌పెక్టర్‌కు సహాయంగా వుంటుంది. వీలున్న ప్పుడల్లా ముద్దులు పెడుతుంది. మహేశ్వరి, రంభ ఇద్దరూ ఇన్స్‌పెక్టర్‌ను ప్రేమిస్తారు. ఆ విధంగా కూడా అతను వారి సునసుల్లో బంధింప బడిన ఖైదీ ఇన్స్‌పెక్టర్ అవుతాడు. చివరన ఇన్స్‌పెక్టర్ మహేశ్వరిని పెళ్లి చేసుకుంటాడు.

దర్శకుడు అన్ని సన్నివేశాలను పటిష్టంగా రూపొందించాడు. ఫైటింగులు, డాన్సులు ఆకట్టు కుంటాయి. పోలీస్ వ్యవస్థలోని అవినీతిని తుడిచి వేయటమే ఉద్దేశంగా ఈ సినిమా చక్కగా రూపు దిద్దబడింది.

సుమన్ ఫైటింగుల్లోను, డాన్సుల్లోను బాగా రాణించాడు. రామిరెడ్డి విలన్ పాత్రలో తగిండి. మహేశ్వరి, రంభలు ఆకర్షణీయంగా డాన్సులు వేశారు. బప్పిలహరి సంగీతంలో కమ్మదనం తగ్గింది. వి.ఎస్.ఆర్. స్వామి కెమెరా అన్ని దృశ్యాలకు హంగులు దిద్దింది.

## పులివెందుల మున్సిఫ్ కోర్టులో

S.C. 6/95

స్టేట్ బ్యాంక్ ఆఫ్ ఇండియా, బ్రాంచి మేనేజరు - బలపనూరు -వాది

Vs

తమ్మిశెట్టి శ్రీరాములు, S/o. చిన్న వెంకటేష్, బలపనూరు -ప్రతివాది

పై దావాలో ప్రతివాది నోటీసుకు గాను వాయిదా 20.10.95 తేదిన ఉన్నది. ఆక్షేపణలున్న తెలుపు కోవచ్చును.

జి. ప్రభాకరశాస్త్రి,
అడ్వకేటు, పులివెందుల

## చంద్రబాబు

మొదటి పేజీ తరువాయి

ముఖ్యమంత్రిత్వం ఇస్తే, తోడల్లుడి ఇల్లు మరొక అధికార కేంద్రమౌతుంది. ఇటు, అటు ఎమ్మెల్యేలు గోడ మీద పిల్లి ఆట ఆడుతారు. ఒకసారి ఇస్తే పీకడం కష్టం. ఇవ్వకుంటే వెంకటేశ్వర రావు నసపెట్టి సతాయిం చేస్తున్నాడు. ఏది దారిరా భగవంతుడా అని అడగడానికి చంద్రబాబు రేపు 30 తేది తిరుమల వెంకన్న సన్నిధికి ప్రయాణం కట్ట వున్నాడు. యుగ యుగాల నుంచి ఇద్దరు సతుల ముద్దు ముచ్చట్లు ఏ మాత్రం పొరపొచ్చాలు లేకుండా బహు నేర్పుగా తీరుస్తున్న తిరుమల వెంకన్నకు ఇద్దరు తోడళ్లుల తగవు తీర్చడం చిటికెలో పనే కదా? ఈ చిక్కు ముడిని ఆ భగవంతుడెట్లా విప్పుతాడో చూద్దాం?

అయితే మంత్రి వర్గ విస్తరణ వాయిదా పడే కొద్దీ చంద్రబాబు ప్రభుత్వం నవ్వుల పాలౌతున్నది ఎన్టీ రామారావు గారు అప్పుడే - గోలికాయ లాట ఆడే పిల్ల కుంకలను గద్దె నెక్కిస్తే ఇట్లానే వుంటుందని పబ్లిగ్గా ఎగతాళి చేశాడు. ఎమ్మెల్యేలలోనూ చులకనా పూర్వక జోక్‌లు ప్రేలు తున్నాయి. ప్రజలు సైతం ముఖ్య మంత్రి రా... సమర్థతను శంకించే పరిస్థితు లేర్పడు తున్నాయి. ఈ సూక్ష్మాన్ని తెలిసుకో వాలంటే మంత్రి వర్గ విస్తరణ చేసి తీరాల్సిందే! అదెంత త్వరగా జరిగితే ముఖ్య మంత్రికి అంత గౌరవం; ప్రభుత్వానికి ప్రతిష్ఠ.

## సినిమా

9పేజీ తరువాయి

నాటికి రజని కాంత్ పరిస్థితిని బట్టి ఏదో ఒక ముగింపును విడుదల చేస్తారు. రాజకీయ రంగు పులుముకున్న ఆ చిత్రం పతాక సన్నివేశంలో సంభాషణ తర్జుమా...

విలన్: ఒరేయ్! నేను మొసలి. నా జోలికి వచ్చావో ఇక అంతే సంగతులు.

రజని: నీళ్లల్లో (పడవలో) ఉన్నంత వరకేరా నీ బలం. ఎత్తి ఒడ్డులో పడేస్తే, ఎంత పోరాడు. విలవిల తన్ను కుంటావు. కాని, నేను అలా కాదురా! నీళ్లల్లో వున్నా నేను ముత్యమే. ఒడ్డున ... ముత్యమే!

# స్వంత కాళ్లపై నిలవాలని రోశయ్య ఆరాటం!

## తీరు మారకుంటే తోక కత్తిరించాలని మాజీ పెద్దల ఆలోచన

రాష్ట్ర కాంగ్రెస్ కమిటీ అధ్యక్షుడిగా కె. రోశయ్య వ్యవహరిస్తున్న తీరు పట్ల ఆ పార్టీ సీనియర్ నాయకులు పెదవి విరుస్తున్నారు. రోశయ్య గనుక తన ధోరణిని మార్చుకోక పోయినట్లయితే "అసలుకే ఎసరు" పెట్టక తప్పదని సీనియర్లు హెచ్చరిస్తున్నారు. మాజీ ముఖ్య మంత్రులు శ్రీ కోట్ల విజయ భాస్కర రెడ్డి, నేదురుమల్లి జనార్ధన రెడ్డి ఆశీస్సులతో అధ్యక్ష పీఠం ఎక్కిన రోశయ్య గతం మరచి ఒంటెద్దు పోకడ పోతుండటంతో ఆ రెండు వర్గాలకు చెందిన నాయకులు రోశయ్య పట్ల ధుమ ధుమ లాడుతున్నారు. విజయ భాస్కర రెడ్డికి అత్యంత సన్నిహితుడైన మాజీ మంత్రి ఎం.వి. మైసూరా రెడ్డి ఇప్పుడు రోశయ్యతో తీవ్రంగా విభేదిస్తున్నారు. రోశయ్య వైఖరిని ఆయన కోట్ల వారి దృష్టికి కూడా తీసుకు వెళ్లారు. పార్టీ అధ్యక్షుడి పగ్గాలు చేత పట్టాక రోశయ్య క్రమంగా కోట్ల వారిని పక్కన బెట్టినట్లు వ్యవహరిస్తుండటంతో కోట్ల కూడా రోశయ్య పట్ల కోపంగా వున్నారట. నిన్న మొన్నటి దాకా చెట్ట పట్టాలు పట్టుకొని నడచిన మాజీ మంత్రి డి.కె. సమర సింహారెడ్డి కూడా ఇప్పుడు రోశయ్యకు బాగా దూరంపై కాలు దువ్వుతున్నారు. రాష్ట్రంలో వచ్చే ఎన్నికల నాటికి తానొక్కడే మహా నాయకుడిగా మిగిలి పోవాలన్న తపనతో రోశయ్య తమను అణగ దొక్కే కార్యక్రమంలో వున్నాడన్నది మాజీల అభియోగం. పదువులేక మాజీలంతా చెట్టుకొకరు, పుట్ట కొకరుగా వున్నారు. కనీసం పార్టీ పరమైన నిర్ణయాలైనా జిల్లాల వరకు తమను సంప్రదించక పోతే భవిష్యత్తులో తమ ఉనికే గల్లంతయ్యే ప్రమాదం వుందని మాజీ మంత్రులంతా ఆందోళన చెందుతున్నారు. అయితే రోశయ్య మాత్రం అస్మదీయ సూత్రాన్ని పాటించి జిల్లా స్థాయిలో తన సొంత రాజ్య స్థాపనకు సిద్ధం కట్టాడట. జిల్లాలో రెండు గ్రూపులున్న చోట పిట్ట పోరు పిట్ట పోరు పిల్లి తీర్చినట్లు తన సొంత బుర్ర ఉపయోగించక్కుం రెండు వర్గాలకు నచ్చటం లేదు. రోశయ్య తన ధోరణి మార్చుకోక పోతే తాము వేరే గూటిని చూసుకోవాల్సి వస్తుందని హెచ్చరించడంతో పాటు మాజీలు అడపా దడపా ఎన్టీ రామారావు గడప తొక్కుతున్నారు. పాపం రోశయ్యది జుత్తు పీక్కుందామన్న వీలు లేని పరిస్థితిగా వుంది. కాగా నేదురుమల్లి జనార్ధన రెడ్డితో రోశయ్య సంబంధాలు మామూలుగానే వున్నప్పటికీ నేదురుమల్లికి అత్యంత ఆప్తుడైన సి.ఎల్.పి. నాయకుడు పి. జనార్ధన రెడ్డితో రోశయ్య బహిరంగ యుద్ధానికి సిద్ధమయ్యాడు. రాష్ట్రంలో ప్రస్తుతం కాంగ్రెస్ పార్టీ ఉనికిగా వున్న నామ మాత్రపు సి.ఎల్.పి.ని తన శక్తి సామర్థ్యాలతో ఒక ప్రత్యేక గుర్తింపు తెచ్చిపెట్టి రాష్ట్ర స్థాయిలో నాయకుడిగా ఎదుగుతున్న పి. జనార్ధన రెడ్డి పట్ల రోశయ్య కినుక వహించటం సమంజసమే. రేపు ఎటు పోయి ఎటు వచ్చినా పి. జనార్ధన రెడ్డి తనకు అడ్డంకిగా మారతాడన్న అనుమానం రోశయ్య బుర్రను తొలుస్తున్నది. కాంగ్రెస్ లెజిస్లేచర్ పార్టీ కూడా పిసిసిలో అంతర్భాగమేనని, సి.ఎల్.పి. నాయకుడు పిసిసి అడుగులకు మడుగు

### పిసిసిలో పెచ్చరిల్లుతున్న కుమ్ములాటలు

లొత్తాల్సిందేనని రోశయ్య ఉవాచ. అయితే స్వతంత్ర వ్యవస్థగా వుండాల్సిన సి.ఎల్.పి. పిసిసి తొత్తుగా వుండటం మంచిది కాదన్నది పిజెఆర్ అభిప్రాయం.

### వివాదా చాబిలో జిల్లా ఇన్‌ఛార్జ్‌లు

రాష్ట్రంలోని వివిధ ప్రాంతాల్లో మహిళలు, దళితులు కాంగ్రెస్ పార్టీ కార్యకర్తల పై జరుగుతున్న అరాచకాలకు వ్యతిరేకంగా శాసన సభలో తమ వాణిని వినిపించేందుకు వీలుగా సి.ఎల్.పి. తరపున జిల్లాకొక ఎమ్మెల్యేను ఇన్‌ఛార్జిగా నియమించారు. ఈ నిర్ణయాన్ని రోశయ్య తీవ్రంగా వ్యతిరేకించటంతో పాటు ఇటు వంటి నిర్ణయాలు తీసుకునే అధికారం సి.ఎల్.పి. నాయకుడికి లేదని, ఒక్క పిసిసి మాత్రమే ఈ విధమైన నియామకాలు చేయాలని రోశయ్య అంటున్నాడు. అలా వీలు కాదంటే రేపు జిల్లా అధ్యక్షుల్ని కూడా పి. జనార్ధన రెడ్డినే నియమించు కోమనండి అంటూ రుసరుస లాడుతున్నాడట. పి. జనార్ధన రెడ్డి మాత్రం రోశయ్య అభ్యంతరాన్ని ఖాతరు చేయక తన ధోరణిలోనే ముందు కెళ్తున్నారు.

ఇలా వుండగా ప్రచార కార్యదర్శి హోదాలో ద్రోణంరాజు సత్యనారాయణ స్వతంత్రంగా జిల్లాల్లో వేలు పెట్టడం కూడా రోశయ్యకు గిట్టడం లేదు. అన్ని వర్గాలను కూడ గట్టుకొని పార్టీని ముందుకు నడిపిస్తాడన్న నమ్మకంతో రోశయ్యకు పిసిసి కిరీటం పెడితే ఈ విధంగా ఒంటెద్దు పోకడగా వ్యవహరించడం పార్టీ శ్రేయస్సుకు మంచిది కాదని సీనియర్లు నెత్తి నోరు బాదు కుంటున్నారు.

## స్మృత్యంజలి

మా అబ్బాయి

**గోసు వెంకటసుబ్బారెడ్డి**

ఇరవై ఒకటవ వర్ధంతి: 25.9.95



నీ జ్ఞాపకాలను తలచుకొని నీవు లేని ఈ లోకాన్నుండి నీ ఆత్మశాంతికై చిరకాల జన్మరాహిత్యముగా నీవు దైవ సన్నిధిన చిరశాంతితో వుండ వలెనని అనుక్షణము ప్రార్థిస్తూ

జి. రమణారెడ్డి, సుమిత్రమ్మ - తల్లిదండ్రులు

రిటైర్డ్ డిప్యూటీ తహశీల్దారు

మరియు కుటుంబసభ్యులు

ఫత్తేఖాన్‌పేట, నెల్లూరు



...at Navagara Paper Products (I) ltd., NELLORE